
అంకితము
పూజ్యపాదులగు
నా
అత్తమామలకు
— జగ్గకవి

# తొలిపలుకులు

'చిన్ననాడు మా తాత నా చేయిఁ జూచి
యాఱువదేఁడులు జీవింతువబ్బి! యనుచు
రాగిదమ్మిడియైనఁ గోరఁడయె నాకు
జోస్యము వచించి నావంకఁ జూచి నవ్వె'—

అని స్వవిషయమునే కవి జోస్యములో చెప్పుకొన్నాడు. జోస్యములో తాతగారి కెట్టి ప్రవేశమున్నదో తెలియదుగాని మనుమని దీర్ఘాయువగుమని ఆయన కోర్కెయైయుండును. కాని సగములోనే ఆ జోస్యమున కపశ్రుతిగ మనుమనినోట

'ఆఱువదేడులు బ్రదుకుదువనెదుగాని
భావి పరిణామమును జూచివచ్చిరెవ్వ
రది యటుంచి......' అని విధి పలికించెను.

తరువాత; 'మేరువునకన్న స్థిరముగ ధారుణీమ
తల్లికంటె క్షమాకలితముగ జలధి
కన్న గంభీరముగ సుధాకాంతకన్న
విమలముగ... వింతగొలుపు'

తల్లిదండ్రుల వ్యాత్పిండము అలసిపోవునట్లు ఈ కవి తన జీవిత కావ్యము సగములోనే ముగించి ఇప్పటికి పదియేండ్లు కావచ్చినది. తన యాయుర్దాయమునుగూర్చిన జోస్యభాగమును నమ్మకున్నను తాను కీర్తి గడించునని తాత చెప్పిన మాటలు కవి కాదనలేదు. ఈ పదియేండ్లనుండి ఈ 'కళానిధి'ని వెలికి తెచ్చువారులేక మరుగుపడియున్నది. కాలగర్భమున లీనమైపోయిన బావగారిని కీర్తికాయముతోనైన చిరంజీవిని చేయఁబూని కవి బావమరది చిరంజీవి జంపాల శ్యామసుందరప్రసాదిపుడీయంకితము వ్రాయుభారము నామీదనిడిరి. ఇది కీర్తికాముఁడగు కవికోరిక నెరవేర్చునది యని నేను దీని కంగీకరించి కవి మామగారైన స్వర్గీయ జం॥ వెం॥ చా॥గారి యాత్మ కి కళానిధిని ఉపాయన మిచ్చుచున్నాను. కృతికర్త యాత్మయు, కృతిభర్త యాత్మయు వారి వారి అంశలమైన మా యీ చేతకు ప్రీతిజెంది, భగవత్కృపకు పాత్రములై ఆనందమును పొందుగాక.

ఇట్లు కవిసోదరుఁడు,
కొత్త వెంకటేశ్వరరావు చౌదరి,
యమ్. ఏ., యల్. యల్. బి.

# పీఠిక

'కళానిధి' యను నీ కావ్యము కతిపయ ఖండకావ్యముల సంపుటియై. ఏతత్కర్త కీర్తిశేషులగు కొత్త జగ్గయ్యచౌదరి. ఈకవికుమారుఁడు బాల్యమున గుంటూరు హైస్కూలునందు నా విద్యార్థి. అప్పటికే యితనికిఁ గవితాశక్తి మెండుగా నుండెడిది. ఎన్నెన్నియో పద్యములఁ వ్రాయుచుఁ దదుపయుక్తంబులగు పాత్రంబులఁ జదువుచు గణాచక్రము ద్రిప్పినాఁడు. పిదపఁ గూడఁ గవితావ్యాసంగ మించుకంతయు మానక శనివారాదివారములలో నాకడకు వచ్చుచు వేసవి సెలవులలో నన్నుఁ దనయూరికి రప్పించుకొనుచుఁ గవితాకృషిని నిరంతరము సేయుచుండెడివాఁడు. ఇంతియకాక సొంతముగా నొక గ్రంథాలయము నేర్పఱచుకొని తన్మూలమునఁగూడ భాషాసేవ విస్తృతముగాఁ జేయుచుండెడివాఁడు. ఈతని కవిత్వము లలితపదాలంకృతమై మృదుమధురమై సరసమై నిర్దుష్టమై యుచితస్థాన విన్యస్తాలంకృతి రమణీయమై పాఠకలోకము నాకర్షించుచుండును. ఇందులకే తత్కవి కృతంబులగు సంగమేశ్వరతారావళి, పాపవినాశనశతకము, పన్నా, ప్రకృతకావ్యమగు కళానిధియు నుదాహరణములు.

ఈ కవి స్వభావముచేతనే దేవతా గురుభక్తిగలవాఁడు. ఆత్మస్తుతి నెంతమాత్రము నొల్లఁడు. దీని కొక నిదర్శనము. 'నా నేర్చినది కొన్నినాళ్లయైనను నన్ను గురుభావమునఁ జూచుకొనెడువాఁడు' 'పన్నా' యను కృతిని నాకు సమర్పించుటయు మద్రచితంబులగు గ్రంథములనెల్ల ముద్రింపింప సంకల్పించుటయు నిందులకు సాక్ష్యము. ఈతఁ డాత్మస్తుతి నొల్లఁడని యెఱింగియు నిట్టి యుపకారిని బ్రశంసించుట కృతజ్ఞతాచిహ్నమని భావించి నేను నా కాదంబరీ గ్రంథములో గూఢముగా నొక పద్యమున

మ॥ గుణసంపన్నుఁడు బుద్ధిశాలి పసిఁడిక్ గ్రొత్తావిమాడ్కిన్ గళా
చణతాశాలితయున్ వినీతి కవిరాజ ప్రీతిచెన్నా సద
గ్రణి మత్కావ్యసహాయకారి ఋతవాగ్గణ్యుండు తన్ బేరుకో
నణువేనొల్లఁ డటేనిఁ జేర్కొనుట న్యాయ్యంబౌను విశ్రాంతిమై.

అని విశ్రాంతిస్థానమునఁ దన పేరు వచ్చునట్లు తన్నుఁగూర్చి చెప్పుటను గమనించి యీ పద్యమును గ్రంథమునఁ బ్రకటింపకుండుటకై నన్నుఁ జాల నిరోధించినాఁడు. ఇట్టి గుణవంతుని ఆంధ్రభాషాయోష నమూల్య కావ్య రత్నహారంబుల నలంకరింపఁదగిన యువకవిని—అకాలంబుననే కోల్పోయిన యాంధ్రలోకము కవికుటుంబమువలెనే దురదృష్టవంతమని చెప్పక తప్పదు.

ఇక్కవికుమారుని రసవద్రచనలు కాలగర్భంబున లీనములు గాకుండ జాగరూకతతో సేకరించి 'కళానిధి'యనుపేర నచ్చొత్తించి యిక్కావ్యరత్నమును స్వర్గీయ నిజ పితృపాదులపేర నంకిత మిచ్చిన యేతత్కావ్యప్రకాశకులగు శ్రీయుత జంపాల శ్యామసుందరప్రసాదుగారాంధ్రలోకమునకుఁ గడుంగడు నభినందనీయులు. వీ రిక్కార్యంబుచే బంధుకృత్యం బొనర్చుటయేగాక భాషాసేవయు బహుళముగా నొనర్చుటంజేసి మఱింత ప్రశంసాపాత్రులగుచున్నారు. ఇందుద్ఘాటనీయాంశములు కొన్ని యున్నను శీతజ్వరబాధాపీడితుఁడనైయున్న నన్నవ్యవధిగా నీ పీఠిక వ్రాసియిమ్మని వేగిరించుటచేఁ గాలము నారోగ్యముం జాలమిచే నా యంశములఁ జర్చించు భారము పెద్దలకే వదలివేయవలసివచ్చినది. ఇవ్విధముగా నాకు మత్ప్రియాంతేవాసిస్మృతిని గల్గించిన మన్మిత్రులగు శ్రీయుత కొత్త వెంకటేశ్వరరావుచౌదరి యమ్. ఏ., యల్. యల్. బి. గారి నభినందించుచు నీ పీఠికను ముగించుచున్నాను.

క॥ కన్యాదానము సేసిన
మాన్యచరిత్రునకు నీదు మామకుఁ గవితా
కన్యామణి నొసఁగి కడుఁ
ధన్యత గడించితివిగదా జగ్గకవీ!

ఇట్లు,

గుంటూరు,
31—12—42.

కవిశేఖర పళ్లె పూర్ణప్రజ్ఞాచార్యులు,
సంస్కృతాధ్యాపకులు,
హిందూ కళాశాల, గుంటూరు.

# మా మాటలు

పూజ్యులైన మా బావగారు ఈ చిన్ని కావ్యాన్ని 1930 ప్రాంతాన వ్రాసారు. నాకప్పటికంతగా గాయకంలేదు. వారు 1933 సం॥లో దివంగతులయారు. అందుచే ఈకావ్యం బైటికిరాలేదు. వారు కవిత్వంలోనే కాకుండా నాట్యకళలోనూ పరిశ్రమచేసారు. వారి నెరిగినవారి విషయాలప్పుడపుడు తడువుతుండగా నాకీ కవిత్వంమీద మక్కువ జనించింది. అందుచే నా ఖండకావ్యాలన్నీ "కళానిధి"అన్న మకుటంతో ప్రకటించాము.

వారి స్వహస్తలిఖితాన్నే యథామాతృకంగా ముద్రింపించడమే సబబనిపించింది. ఖిలమైనచోట్లదప్ప తక్కిన మాతృక కెక్కువ భిన్నంగా నడవలేదు.

కొన్ని గ్రంథాలు వారుండగానే వెలువడినయి. వాని నన్నిటినీ ఒక్కచో జేర్చి ముద్రించడ మీ కాలంలో అయితిగానిపని. నిదానంగా మాత్రం వీటిని ఆంధ్రసోదరుల కందింపగలం.

నేడు కవిత్వం పలురకాల వర్ధిల్లుతుంది. అందులో నొక కోటికి జెందిన యీ కావ్యాన్ని లోకమాదరిస్తుందని మా ఆశయం. గుణగ్రహణ పారీణుల కింతకన్న నివేదింపవలసినదేముంది? పొరపాటన్నది మానవులకు సహజంగదా! అందులో మంచిని గ్రహించి మా యుద్యమానికి దోడ్పడాలెనని మనవి.

జంపాల శ్యామసుందరప్రసాద్.

# వి ష య సూ చి క

# ఒప్పగింత

మామకు మామగు భాగ్య
మ్మీ మహిలోఁ గొంతమందికేమొ సుమండీ !
నోములు నోఁచిన వారికె
కామక లభియించు నిట్టి కల్యాణంబుల్. ౧

నీ ముద్దుబిడ్డ "ప్రేమా
రామంబునఁ బుష్పమై పరాగకణంబై
ఆమోదమ్మై" క్రమముగ
మామా ! నా జీవితంబు మధునద మయ్యెన్. ౨

కవితాసంగతిఁ జొక్కుచుఁ
జవులూరెడు పిల్లపాదుషా భోగములన్
దవిలితి నున్నన్నాళ్లును
బువుబలె మధు వొలికి సిద్ధివొందితి మున్నే. ౩

రసమయజీవిత మెప్పుడొ
కుసుమముబలె రాలునంచు గుర్తించియు నీ
ముసిముసి నవ్వులలో నొక
పసితనమునకైతి నెమరుపడి నవు డెల్లన్. ౪

చిన్నారి కన్ను వెన్నెల
కు నోఁచని బ్రదుకు కెంతో కొఱఁతయ పోని
మ్మన్ని కొఱంతలు దీర్చెడు
చిన్ని కృతిం గంటిఁ గావ్యసిద్ధుఁడ నైతిన్. ౫

మీ వంశము మా వంశము
దేవాంశల కయ్యె తాత దెల్పిన జోస్యం
బావంత దప్ప దింతకు
మీ వరహాలయ్య కతన మే లొనఁగూడెన్. ౬

నీ కన్నవాని ఋణమిం
కే కరణిన్ దీర్చుకొందు నీ బాబునకున్
ఠాకూరువంటి కవియో
లే కా సారంథవంటి లేమయొ? కలుగున్. ౭

ముట్టినది ముత్తియమ్ముగఁ
బట్టిన దొరపిడికి మీఱు బంగారముగాఁ
జెట్టిమఱఁది యిలు కళలకుఁ
బట్టయి నలుమూల లెసఁగ వలె ముచ్చటగా. ౮

మా "యమ్మఁడు" జాండంబుల
మ్రోయించున్ దన్నినాదములు విందు మిటన్
కాయమ్ములు కొఱవడినను
శ్రేయమ్ముల కేమి కొఱఁత సేకొనుఁ డుభయుల్. ౯

# కళానిధి



## ఆంధ్రభారతి

శ్రీమదనంతకోటి శుభ
చిహ్నిత తావక దివ్యపాద ప
ద్మామృతపూరపానకల
నాకలనాచలనావలోకన
శ్రీ మహితాస్మదీయమృదు
చిత్తమిళిందమనోజ్ఞగీతికా
స్తోమములన్ భజింతు దయఁ
జూడు మహర్నిశ మాంధ్రభారతీ ! 1

తొలిపలుకులౌ వేదముల స్వరూపమ్మునఁ
గమలాసనుని ముఖకమలమందు
వాగ్రూపమున నెల్ల వారినూఁకొట్టించు
ప్రవిమల జిహ్వాగ్ర భాగములను
విజ్ఞానమయరూప విభవమ్మునన్ సద్గ
ణాధీశ్వరుల యంతరాత్మలందు
సాకారమై యక్షరాకారమున బహు
భాషావళీగ్రంథ పత్రములను
గుట్టుగాఁగాఁపురము సేసికొనుచు సేను
కోరినప్పుడు నానాల్కకొనను జేరి
నృత్యమొనరించు వాణికిఁ బ్రత్యహమ్ము
నధికభక్తిఁ బ్రణామమ్ము లాచరింతు 2

భక్తిమెయిన్నతెంబు నినుఁ
బాడుచు సేవయొనర్తునన్న యా
సక్తిని గావ్యహారములు
చక్కఁగఁ గూర్పఁదలంతుఁగాని ధీ
శక్తి కొఱంతవాఱె నెటు
సల్పద నూడిగమింకనిన్ను సా
ధూక్తులఁ బ్రస్తుతింతు నను
నొప్పరికింపకు మాంధ్రభారతీ! 3

# మంథరతో - కైక

చాలుంజాలును గట్టిపెట్టుమిఁక, నీ
సంభాషణీయాంశ ము
ద్వేలంబయ్యెఁ, గఠోరపద్ధతుల న
న్వేధింప నీతంత్ర మీ
వాలోచించినభంగిఁ దోఁచునకటా !
యారీతిఁగాకున్న ని
ట్లేలా మూతిబిగింపు పర్వములు ? నీ
కెల్లప్పు డో మంథరా ! 1

చెప్పకు మింక నాకు విని
చేయఁగఁజాలను దుష్కృతంబు, నీ
కొప్పదు చేయకుంట మది
కొప్పదు చేయుట కీవు రాము చి
న్నప్పటినుండి సాఁకితి వ
యాచితప్రేమరసానుభూతి నీ
చొప్పున నేఁడు వల్కెదవు
చోద్యము నీచరితంబు మంథరా ! 2

నిరతిశయానురాగ మది
నెక్కొనియుండుటఁ జేసి శ్యామసుం

దరునిషయిన్ వసిష్ఠుఁడును
దండ్రియు నమ్మలు దమ్ములున్ గుణా
కరులగు నార్యులున్ జనని
కాయము పాయనివేడ్కతో వసుం
ధర కధినాథుసేయ మదిఁ
దల్పఁగ బీఁటలమీఁదఁ బెండ్లి నేఁ
జెఱపి శిరంబు శిట్లుదిని
చీఁకగ నేమిఫలంబు? మంథరా! 3

భరతునిసేమ మూరసి కృ
పామతితోఁడ వచింపుచుంటి వే
నెఱుఁగుదు నీమనంబు జల
జేక్షణ! నాసుతు సౌఖ్యపెట్టఁగాఁ
బరులకుమారుఁ గానలకుఁ
బంపఁదలంచుట న్యాయమొకో? యీ
తెఱ వెపుడైన వింటిమె? సు
ధీజనదూష్యము గాదె? మంథరా! 4

నాకొమరున్ దయామతిఁ గ
నన్వలెనంచును, భూరివైభవా
నీకముఁ గూర్పుమంచును, మ
ణీగణ భాసురసింహపీఠి న

స్తోకవిభూతిరేకమున
సొంపుగనిల్పుమంటంచుఁ, గోరసాఁ
గాక రఘూత్తమోత్తముని
గాననసీమకుఁ బాఱద్రోలుమం
చేకరణిన్ వచింతు హృద
యేశ్వరుతోఁ బసిబూని మంథరా! 5

భరతుం డొక్కఁడు రాముఁ డొక్కఁడను దు
ర్భావంబు నా యాత్మకీ
వఱకున్ గల్గదు; లేనిపోనిబెడఁదల్
వర్ధిల్లఁగాఁ బాపసం
భరితాలోచన లేల సల్పె డిటు లీ.
వార్తన్ విన్ గాఢ దు
ర్భర సంతాపముచేతఁ దల్లడిలు నా
ప్రాణేశుఁ డో మంథరా! 6

జననాథున్ వరమెట్లు కోరుదును గా
సల్యాత్మజు న్గానకున్
బనుపన్ నాసుతుఁ బట్టభద్రుఁగ నొన
ర్పన్; లోకు లేమందు రీ
పనికిన్ మాభరతుండుమాత్ర మసలా
ప్పన్ జూచునే? నన్ను దూ

రునుగా కింత యెఱుంగనేరమికి ? చా
　　లుఁ జాలు నోమంథరా ! 7

చిరసౌహార్ద్ర భరంబుచే భరతుఁడా
　　శ్రీరామచంద్రుఁ సహో
దరభావంబునఁ బూజసేయు మనచేఁ
　　తల్ విన్నచో వాఁడు దు
ర్భరసంతాపమునొందు సౌఖ్యమని సం
　　భావింపఁగాఁబోవఁ డ
కటా ఱాఁ మాలినకార్య మేల సలుపం
　　గా ! నిప్పుడోమంథరా ! ౮

అనఘుని రామభద్రు గహ
　　నాంతరసీమలఁ గాఁపురంబు సే
యను బనుపంగదే యని ధ
　　రాధిపుతో మొగమోట మించ కే
ననఁగలనొక్కొ ? నిక్కముగ
　　నయ్యయొ ! బిడ్డలఁ గన్నదాన నిం
దున సుఖమన్ననున్నె ? కడు
　　దుఃఖము లుఁన్నవి గాక మంథరా ! 9

ఎడ్డెమఁటన్నఁ దెడ్డెమను
　　టే తగవా ? రఘురాముఁడన్న నా

బిడ్డనికంటె నెక్కుడగు
　　　　ప్రేముడిఁ గాంతును నేఁడు వాని కీ
చెడ్డను గూర్ప నేను కృషి
　　　　సేతునె ? నల్వుర నోళ్ళలోఁ బల్కఁ
బడ్డఁ బ్రయోజనం బణువు
　　　　మాత్రముఁ గల్గునె చెప్పు ? మంథరా ! 10

నిక్కము సెప్పుచుంటి విను
　　　　నీకు, సుహాపుల వెక్కిరింపఁగాఁ
గొక్కెర పుట్టె నన్నటులు
　　　　కొంకక రాముని కానకంప నీ
రక్కసముండ మంథర ధ
　　　　రాతలమందు జనించెనంచు న
మ్మక్కలు నాడుకొందు రటు
　　　　లాఁటిది పా లగుటేల ? మంథరా ! 11

మంచియుఁ జెడ్డయుం గనక
　　　　మంథరపల్కును వేదవాక్కుగా
నెంచి వివేకహీనత న
　　　　హీనశుభప్రతిభాప్రభాసమ
భ్యంచితసారసద్గుణ వి
　　　　భాకరవంశపయోధిచంద్రు మే

లెంచఁగలేక కైక యిటు
లింతలు చేసె నటంద్రు మంథరా! 12

పుట్టదు బుద్ధి నాకు రఘు
పుంగవు క్రూరమృగాకులోగ్రసం
ఘట్టనజాయమాన భయ
కంపిత కాననభూమికంపి నా
పట్టికి రాచసౌఖ్యము ల
పారము గూర్పఁగ రామభద్రునే
పట్టము నేలనిమ్ము తగు
వాఁడతఁడే నిజమెన్న మంథరా! 13

కడుపునఁగన్న పుత్రకుఁడు
గాఁడనుకారణ మొండెకాని, నే
నడలనిప్రేమతోడ నని
శం బతనిన్ గనుగొంచునుందు, నా
తఁడు సయితంబు పాపము య
థార్థముగాఁ దనతల్లికంటెఁ బ్రే
ముడిఁగను నన్ను కాన కెటు
పొమ్మని పలుకఁడునమ్మ మంథరా! 14

తగ్గనిప్రేమ రాముకుఁ
తమ్ములపైఁ గల దెంతొ వారికిన్

లగ్గోడఁగూర్ప నాతఁడు ని
రంతరమున్ దలపోయు నన్నిటన్
బగ్గగలాఁడు నన్నుఁగడు
బత్తిమెయిన్ గనుచుండు వాని కే
నెగ్గుఁదలంప లోకులు ప
యింబడి తిట్టరె నన్ను, మంథరా! 15

శ్రీరామా! రఘురామ! దాశరథి! రా
జీవాక్ష! శ్రీరాఘవా!
రారా! నాయన! బాబు! తండ్రి! యని చే
రన్ జీరి ముద్దాడి నేఁ
డేరీతిన్ వచియింపఁ జాలుదునొకో!
యీ నోటితోఁ గానకున్
బోరా! కాఁపురముంట కీవని దయన్
బోనాడి నే మంథరా! 16

అలయిక కోర్వఁజాల దిసు
మంతయు నన్యుల నొవ్వనాడఁగాఁ
దలఁపద యత్తమామల కు
దాత్తమతిన్ బరిచర్యసల్పుఁ బె
ద్దల వచనంబు తాఁదలను
దాలుచుఁ జీమకునైనఁ గష్టముల్

గలిగినఁ జూడఁజాలద య
కల్మషవర్తనమందు నాపెనేఁ
బలికి మఱొక్కరికిఁ బిదపఁ
బల్కవలెన్ మముబోంట్లకెల్ల నీ
తులు గఱపంగఁజాలుఁ బర
దోషములెన్ను స్వభావమాపెకున్
గలుగదు స్వప్నమందయినఁ
గాని వివేకమునందుఁ బెద్ద పె
ద్దలు నయితంబుఁ జాలర య
ధర్మముపేర్విన భీతిఁ జెందు ని
చ్చలు రఘురాముపాద పరి
చర్యలొనర్పఁ దుఱంగలించు కో
మలి, సుగుణాంబురాశి యన
మాన పవిత్ర చరిత్ర గణ్య మా
కొలమునకెల్ల వన్నెనిడు
కోడలు సీత మొగంబుఁ గాంచఁగా
గలనొకో? నీ వచించినటు
గా నొనరించిన నేను మంథరా! 17

జనవిభు కాళ్ల వ్రేళ్లఁబడి
నల్పఁగఁ జాలుదు నింతమాత్రపుం

మంథరతో - కైక

బని యొక లెక్కగాదు నను

వంటిసుధీమణి కైనఁగాని యిం

దున లవమాత్రమైనఁ బరి

తోషము సౌఖ్యము లేమిఁజేసి నా

మనమున నిచ్చగింపఁ బలు

మాఱు వచింపఁగ నేల ? మంథరా !!! 19

# జిజ్ఞాస

జననమందిన యుత్తర క్షణమునుండి
కంటికిని ఱెప్పమాడ్కి- వెన్నంటి-చీమ
గఱచినంత ప్రమాదమ్ముఁ గలుగకుండ
నటుల రక్షించి - నేలపై నడుగువెట్టు
నంతనే ముద్దు పాదము లఱిగిపోవు
ననుచుఁ దహతహఁ జెంది దయార్ద్రభావ
కలితుఁడై మూఁపు గాయలుగాయ మోచి
పెంచిన సుతుండు దనప్రాణ వితతిఁదీయ
సాహసించెడు నంతటి జాల్ముఁడైన
విసుగుఁ జెందఁడు సుంతైనఁ గసరఁడట్టి
తండ్రి హృత్పిండ మే పదార్థము లిమిడ్చి
సృష్టిఁ జేసితివో దేవ! చెప్పఁగలవె? 1

నిఖిల భూతమ్ములందున నిండియుండి
ప్రకృతికంటెఁ బరుండవై పఱఁగి జీవ
జాలము సృజింపఁ బెంపను సంహరింపఁ
జాలు విశ్వాత్ముఁడవునీవు సైతమనఘ!
శక్తిలేమిని క్షమియింపఁ జాలనట్టి
తనయు దుష్కృతములనెల్లఁ దండ్రి సైఁచు

సానుతాపమ్ముఁ గొని నోరుసాఁచి యొక్క
మాఱుప్రార్థించి మన్నింపఁగోరునట్టి
తండ్రి హృత్పిండమే పదార్థము లిమిడ్చి
సృష్టిఁజేసితివో దేవ! చెప్పఁగలవె? 2

తనువుఁ దాల్చినతోడనే తనయునింగు
భార్య, యౌవనమెల్లను బాపువానిఁ
గ్రమముగా బాల్యదశయెల్లఁ గడపి తనదు
ధననిచయ మంతయుఁ జూఱకొనెడివాని
విగతజీవనుఁడై శోకపీడి తాత్మ
కలితుఁ గావించి తనప్రాణములను సైత
మపహరించెడి శాత్రవుఁడైన వాని
నెఱిఁగియుండియుఁ బ్రేమవల్లరులఁ జిక్కి
ముద్దుసుతుఁడని యిహపరములకు మూల
కారణంబని తలపోసి కాచునట్టి
తండ్రి హృత్పిండమే పదార్థములిమిడ్చి
సృష్టిఁజేసితివో దేవ! చెప్పఁగలవె? 3

విమల వర్ణాంకితాకాశ వీధికన్న
సురుచి రారుణ బాలభాస్కరునికన్నఁ
జారుశీతల చంద్రికా చయముకన్న
స్వాదుపీయూష లహరికాజలముకన్న

నమల గంగా ప్రవాహోదకమున కన్న
సురభిళ మనోజ్ఞ పుష్పమంజరుల కన్న
శాంతముగ - మోహనమ్ముగ - స్వచ్ఛముగ - స
రసముగ - పవిత్రతరముగ - లలితముగను
దండ్రి హృత్పిండమే పదార్థములిమిడ్చి
సృష్టిఁజేసితివో దేవ! చెప్పఁగలవె ? 4

మేరువునకన్న స్థిరముగ - ధారుణీమ
తల్లికంటె క్షమాకలితముగ - జలధి
కన్న గంభీరముగ - నుషఃకాంతకన్న
విమలముగ - నా ప్రకృతికన్నఁ వింతగొలుపు
తండ్రి హృత్పిండమే పదార్థములిమిడ్చి
సృష్టిఁజేసితివో దేవ! చెప్పఁగలవె? 5

# విలాసిని

లలిత తారుణ్య లావణ్య లహరికా ప్ర
కటిత సర్వాంగ సుందరా కారఁగాఁగఁ
బ్రకృతినిన్ను సృజించెనే ప్రమద ! పురుష
మండలము నేలు నధికార మంత్ర మొసఁగి 1

సురుచిర కలా విలాసినీ శుభ్రతరళ
మంజుల మనోహరాకార మాన్యవైన
భామ ! నీ లేని జగము తమోమయంబు
స్వర్గమైనను నారక సదృశమగును 2

విశ్వంభరా స్రష్ట విమలాంతరస్వరూ
పాధిక లావణ్య మరయఁ గోరి
చిర కఠోర తపమ్ముఁ జేసి పూరుష యత్న
సాధ్యమ్ము గామి విచార మొంది
ఊహించి మైన సముత్సేక రతిఁ దేల
భావ సౌదామనీ సేవకొగ్గి
భువన మోహన కళా పూర్ణ పదార్థమ్ము
కుతుక మిబ్బడి గాఁగఁ గుప్పవోసి
ప్రకృతి కగ్గముగాని రూపమ్ము నెట్లొ
భావ పత్రమ్ముపై వ్రాసి ప్రత్యహమ్ము

కేలు మోత్తు మనాదిశక్తీ! యటంచు
సుందరీ! తాను నీకేమి చుట్టమమ్మ! 3

ఆఱని ప్రేమతత్వము, ర
హఃపరిరంభము, దివ్యకాంతి వి
స్ఫార, మలౌకికాద్భుత వి
చార మనంత సుఖ ప్రమోద మూ
హారచనా ప్రశక్తిఁ ద్రిద
శాలయమందు లభించునంచు మే
మూరక వెఱ్ఱినమ్మకము
నొందఁ బ్రమాణము నీవ సుందరీ! 4

నీకుపమాన మీయఁ గమ
నీయ కళాన్విత వస్తువేదియుఁ
మాకు లభింపదందు కత
నన్, జగమేలు ననాదిశక్తియే
నీ కుపమాన మైన, ధర
ణీ రమణీకమనీయ మూర్తి కీ
వాకర మాట శాంతి హృ
దయంబునఁ బాడెద నిన్ను సుందరీ! 5

# వరప్రసాదము

ఏమో సౌఖ్యము పొముకొంటకని, నీ
చేచ్ఛానువృత్తుండనై
ప్రేమంపుర్ సుతు "ఛత్రసాలు" యవనో
ర్వీచోరకాక్షేయకో
ద్గామజ్వాలల పాలొనర్చి వసను
ధ్యర్ జేర నుంకించు నా
కీమాత్రమ్మగు దండనమ్మె సరిపో
నే? దుష్టశిక్షారతీ! 1

పౌరుషముగల రాచకొమరుండెవ్వఁ
డములుపఱపని ఘోరకార్యములు నన్ను
నలుపుమని భూమికీడ్చిన జాణవగుట
కోరినప్పుడె చావొసంగుదువె? దేవ! 2

అడుగులు బొబ్బలెత్తనని
యంగదలార్చుచు బిడ్డ భూమిపైఁ
బడినఁ దదాది నేల నడు
వర్ జననీకమె కన్నుఁదమ్ములం
దిడుకొని నిచ్చ, లాదరము
హెచ్చఁగ మచ్చికఁ బెంచినట్టి నా

కొడుకు నఁటే ! స్వరక్షణముఁ
కోసము ధూర్తులపాల్టఁ బెట్టితిగా 3

మొగలుల సేనాసమూహమ్ము లేల నా
"జీరజ" దుర్గమ్ముఁ జేరవచ్చె ?
చేరిరిపో, వారిఁ జీల్చి చెండాడక
క్షత్రియబల మేల సన్నగిల్లె ?
సన్నగిల్లిన నేమి, సమరాంగణమ్మునఁ
బ్రాణము లర్పింప నరయమైతి ?
మరయము పో, యిట్టి యాచారదూరమౌ
కుటిలసంధికి నియ్యకొంటి వేల ?
ఇయ్యకొన నేమి, కొడుకు తానయ్యమాట
మీఱువాఁడైనఁ గాక యమేయభక్తి
రాజ్య రక్షణకై తన ప్రాణములను
బరుల కర్పింపనేల కీడ్పడుట దేల ! 4

నమ్మికఁ బుచ్చి నా యనుఁగు
నందనునిగా బలిఁగోరి దేశసౌ
ఖ్యమ్మున కంతరాయ మెటు
లైన నొనర్పమఁటన్న రక్తపా
తమ్మున నే నసాధ్యమగు
దానిని బొందఁగవచ్చు నంచు నిం

ద్యమ్మున కోర్చి కాచె నతి
యాద నతిక్రమణం బొనర్చితిఁ 5

కరమున వాలుఁ దాల్చి రిపు
కంఠవిలుంఠన మాచరించి జ
ర్జరిత మొనర్చి తద్గళ స
రద్రుధిరోరుఝురమ్ములందు సం
చరణ మొనర్చుటో, ప్రథన
సంగతిఁ జచ్చుటయో, వినా మహాం
తర మెఱుఁగన్గదా యిటు, ల
ధర్మప్రవర్తన కెట్టు లొప్పితిఁ 6

కొడుకును గాన్కగాఁ దురక
కూళకొసంగితి రాష్ట్రమందు నే
గడబిడ సేయకుండుటకుఁ
గానన భూమికి నేను స్వేచ్ఛగా
వెడలుట కడ్డుసెప్పమికి;
పీతదయాపరులందు కాది యాం
దొడఁబడియున్ విషణ్ణహృద
యున్ నను వేచుట మానరైరిగా ? 7

అని వగఁజెందు చొక్క విపి
నాంతర భూమిని జాతిపన్నపైఁ

దనువును వ్రాల్చి, యాత్మసతి
　　తన్నుపచారపరంపరాస్థితిన్
గనుఁగొని తేల్చుచుండ క్షత
　　గాత్రుఁడు ఖిన్నుఁడునై స్వజాతిర
క్షణమునకై విచారపడు
　　"చంపతరాయఁడు" జాయ కిట్లనున్　　8

క్రూర తురుష్క-కోటి మన
　　కోటను ముట్టడివెట్ట శక్తివి
స్ఫారతలేనివాఁడనయి
　　సంధిని వేడఁ, గుమారు జీవమే
వారలు కాన్క-గోర జన
　　వందితుఁడైన తనూజుఁ డందుకున్
మాఱువచింప కిచ్చె లల
　　నా! యెటుదాఁటుదు మీ వ్యథాకథన్　　9

ముందు చరిత్ర కారకులు
　　మూర్ఖునిగా, సుతు జంపువానిగా,
సుందరి నన్నుఁ దెల్పుచు వ
　　సుంధరఁ బుట్టుచు బెర్గునట్టి వా
రందఱిచేతఁ దిట్లుదిను
　　మంచిక నా చరితంబు వ్రాయ కె

ట్లుందురె? యిట్టిదాని కయ
　　　　యో! తలయొగ్గిన కారణమ్మునన్ 10

అది యటులుండనిమ్ము, హృద
　　　　యమ్మును జీల్చుచుఁ గత్తికోఁతలన్
బ్రదికిన యంతకాలము వి
　　　　రామ మెఱుంగక; యిప్డు దుర్భరా
పదలకుఁ దాన మా విపిన
　　　　భాగ మదే గతి దాఁట నేర్తుమో
సుదతి! విపత్పరంపరల
　　　　స్రుక్కి యశక్తుఁడనైతి నన్నిటన్ 11

సంధి యనిచెప్పి మమ్ము వంచనమొనర్చి
కోరునటులన్నిటికి నియ్యకొల్పి తుదకు
నగరసన్యాస మిప్పించి నట్టడవిని
నడపియున్ నన్ను వేధింప నుడుగ రరులు 12

విడువక నాదు వెంట నట
　　　　వీస్థలిఁ జేరఁగ వచ్చి కష్టముల్
గుడిచి, మదీయ జీవములఁ
　　　　గోల్పడసేయఁదలంచి వచ్చు నా
చెడుగుఁ దురుష్కకోటిని న
　　　　శింపఁగఁజేసి, మదర్థ మాత్మలన్

విడిచెను భృత్యపంచక మ
　　　నింద్యచరిత్ర! యింక కేది దారియో　　13

అని దారి దోప కూరక
వనరెడు తన ప్రాణవిభుని వదనాంబుజముఁ
గనుఁగొని నిర్భరధైర్యం
బున నప్పుడతుక వచించె బొమముడివడఁగ　　14

వినుము జీవితేశ! వివరింతు నొకయర్థ
మేను దెలిసినంతలోన నుంతఁ
దానిఁ దలఁచి మీరు తగినచోఁ గైకొని
వంతమానఁ దలపఁపలయుఁజుండి　　15

మించిన దానికై యిటుల
　　　మీరు విచారముపూని ముందు గా
వించు ప్రయత్నమెంతయును
　　　వీడి ప్రపంచ విధమ్మెఱుంగ న
ట్లుంచ యెలుంగుతోడ కొడు
　　　కా! కొడుకా! కొడుకా! యటంచు చిం
తించిన లాభ మింత గల
　　　దే? వలదే తలఁపోయి సేయఁగఁ　　16

'నాకన్న' పుత్రశోకము
మీకెక్కుడుగాదు; నాథ! మించిన పనికై

యీ కరణి వగచు నెడ మన  
మేకార్య మొనర్ప నేర్తు మిలలోఁ జెప్పుడా ? 17

చచ్చిననేమి నాకొడుకు  
చచ్చెను దండ్రికి రాజ్యలక్ష్మి నం  
దిచ్చు తలంపునన్ శుభము  
లీశ్వరుఁ డోర్వక పోయెఁగాని, యే  
మిచ్చినఁ దృప్తులై చనక  
యీ తురకల్ నను వెంబడింత్రు ; హా  
చిచ్చఱపిడుగువోలె నుసి  
సేయఁడె నా సుతుఁ డిప్పు డున్నచో? 18

ఆయెను పోయె నెట్టులో, ప్ర  
యాసము నాక యరణ్యభూములన్  
బోయెడివారి నేమిటికిఁ  
బొట్టను బెట్టుకొనం దలంచి పా  
పాయతచిత్తు లీ తురక  
లక్కట మానరు వెంబడింప, నిం  
కేయది సేయకుందు రెపు  
డిచ్చినమాటలు తప్పు దుర్మతుల్ 19

ఇప్పుడు సేయఁగాఁ దగిన  
దేమి ? శరీరమునన్ బటుత్వమా

తప్పెను మీకు, నే నబలఁ,
దప్పక శత్రులు వత్తు వారినే
చొప్పున దాఁక వచ్చుఁ గడు
స్రుక్కితి రేమి వచించుదాన మీ
రప్పని తప్పుగాఁ దలఁప
కేసని సమ్మతి నీయ వేఁడెదన్ 20

మూఁపున మిమ్ముఁగట్టుకొని
ముందరఁ గన్పడు పక్కణమ్ము కా
పాపులు రాకపూర్వమె శు
భప్రదలీలలఁ జేర్చుదాన, నె
ట్లో పడిలేచు చా పిద్దప
యుక్తపథమ్మును ద్రొక్కవచ్చు నీ
యాపద తప్పెనేని, గలఁ
డాపయి దీనుల బ్రోచు నాతఁడే 21

ప్రేమజీవులు నిఖిల నిష్కామపరులు
సభ్యజాతులకంటె నసభ్యజాతు
లందె విరివిగఁ గననగునని చరిత్ర
చక్షువులు నిర్ధరించిన సత్యమనఘ ! 22

వినమే మును 'పన్నా' యను
వనితను 'సంగ్రామసింహు' వంశాంకురమున్

గొనిపోయి భిల్లరక్షణ
మునఁ బెనుచుట, శత్రుభయముఁ బోనడఁచుటయున్

కావునఁ 'బ్రస్తుత' మచటికిఁ
బోవంగాఁ దగును, శక్తిఁ బొదలినపిదపన్
నీవే శత్రుక్షయమును
గావింపన్ జాలు; దల్లకల్లోలముగన్ 24

వారలు త్రికరణశుద్ధిగఁ
గూరిమిఁ జూపింతురేని గొంకక యసువుల్
ధారన్ బోసెద రంతటి
ధీరోదాత్తులు గలారె? త్రిభువనములలో 25

మనుజవరేణ్య! నేఁ బిఱికి
మందును బోయుచునుంటినంచు నీ
వనుకొనఁ బోదువేమొ, సమ
యాంతర మందు మదుక్తి కీవె నె
మ్మనమున సంతసించెదవు సు
మా! ప్రకృతమ్ము తరింతుమేని, నా
వెనుక నెపైన సేమమగు;
వెల్లువదాఁటినఁ జీరలాఱవే ? 26

సమ్మతి భిక్షఁ బెట్టుఁడని
సారెకు సారెకు జీవితేశుతో

న మ్మదిరాత్రి దీనముగ
నాడిన మాటల కాతఁ డల్లై కా
నిమ్మనఁ జాలు నన్నిటికి
నీశ్వరుఁ డింతకు సుంతఁ బూర్వపు
ణ్యమ్మును ద్రోయనేర్తురె ప్ర
యత్నము లెన్ని యొనర్చినన్ నరుల్ 27

అంతట నాతని కపుడా
ప్రాంతంబుల నుండి భేరిభాంకారమ్ముల్
వింతగ వినఁబడఁ జింతా
దంతుర చేతస్కుఁడగుచుఁ దనసతికనియెన్ 28

అరుదెంతు రింకఁ దడయక
పరిపంథులు నన్నుఁద్రుంప భామా! మార్గాం
తర మిపుడేదియు లేదొక
వెరవును యోజించినాఁడ వినుమని మఱలన్ 29

దానికి శక్తి లేదని వి
తర్క మొనర్పక చిత్తశుద్ధితో
మానక సేతు నంచిటఁ బ్ర
మాణ మొనర్చి సముత్సహించినన్
గాని వచింపఁజాల, ననఁ
గా ననఘా! యిది యేటిశంక? మీ
యానతి మీరు నంతటి దు
రాత్మకురాలనుగా నెఱుంగరే 30

ఆలస్యాదమృతం విషమ్మగుఁ; నా
థా! తెల్పుమా వేగ నీ
వాలోచించిన మార్గమేమొ? యటు సే
యన్ దోడ్పడన్ వత్తునం
చా లోలాక్షి ప్రమాణముల్ సలిపెఁ దా
నాత్మేశు పాదాబ్జముల్
కేలన్ దాఁకుచుఁ, గంటనద్దుచు, మనః
క్లేశంబు పోకార్చిన్ 31

దానికి మోదమంది వసు
ధారమణుండు వచించెఁ బ్రేయసీ!
నేనిఁక నెట్టులున్ బ్రదుక
నేరను, అంతకు నాదు నిశ్చయం
బౌనిదినమ్ము; మైనను
దురాత్మకులైన తురుష్క-ముష్క-రుల్
ప్రాణము లూడ్చిన్ వెఱవఁ బాపు
ల గీపులయే పడంచెదన్ 32

అని యొనరింతు నన్నయడి
యాస తోలంగెఁ; గ్రమక్రమమ్ముగాఁ
దనుగతరక్తమే గతిని
ధారలుగట్టుచు నుండెనో కనుం

గాను, మొరు లేల చెప్పవలెఁ ?
　　　　గోమలి ! యెట్టిటో యింతదాఁక నే
బెనఁగితిఁగాని ప్రజ్ఞ, కర
　　　　వీనము వాసికి బోరలే నిఁకన్ 33

మాఱు వచింపకింక నను
　　　　మానము మాని తలోదరీ ! కులో
ద్ధారకుఁడైన బుత్రికుఁ గృ
　　　　తాంతుని పీటికిఁబంచినట్టి యీ
క్రూరుని నీదు ఖడ్గమున
　　　　కున్ బలిసేసి వసుంధరా సతీ
భార మడంచి కొంచక శు
　　　　భమ్ములు వొంది సుఖింపఁగాఁ దగున్ 34

నిలుకడలేనివారయిన
　　　　నీచులచేతను నాదు ప్రాణముల్
వెలలునె? గొంకకీవు మద
　　　　భీష్ట మొకించుక నాలకించి యో
పొలఁతుక ! దోసమంచుఁ దలఁ
　　　　పోయక యాత్మబలమ్ముఁ గోరి నా
తలఁదెగవ్రేయవే యుభయ
　　　　తారకమయ్యెడుఁగాత మిందుచే 35

పతియాజ్ఞఁ జవదాఁట నేరమికి సం
భావించి దీవించి సం
తతసౌఖ్యంబులునీకుఁ గూర్తురు సురల్ ;
ధర్మప్రచారార్థ సం
గతికిన్ దూరగులైన దుష్టులకు జి
క్కన్‌బోక నీ చేతిలో
నతివా ! ప్రాణముఁ బాయుపున్నియము ల
భ్యంబౌను నాకియ్యెడన్ 36

అని వచియించు నాపలుకు
లామెకుఁ గర్ణములందు శూలముల్
చొనిపిన రీతిగాఁ, బిడుగు
సోఁకినయట్లుగ, నారకాగ్నిలోఁ
బెనువెతఁజెందుమాఁడ్కిఁ దలఁ
పింపఁగఁ నాయమ బోరుబోరునన్
గనుఁగొన లశ్రువుల్ గురియ
గా విలపించె కలస్వనంబునన్ 37

తుదకెట్టెటులో తెప్పిరిల్లుకొని నా
థున్ గాంచి యాసాధ్వి తా
హృదయోద్వేగము నాఁచికొంచుఁ గరుణా
ర్ద్రీభూతచేతస్కయై

యెదిరియో పలుకంగ నించుకంత వదనం
బెత్తంగ భూమీశుఁ డా
మదిరాక్షిఁ దనకడ్డు రాకుమను చి
మ్మాడికన్ వచించెన్ వెసన్ 38

పతియవసాన కాలమునఁ
బ్రార్థనసేయ వరమ్ములీయఁగా
సతివ కవశ్య ధర్మమని
యన్నది నీకు నెఱుంగరాని సం
గతియె ? యిఁకన్ క్షణమ్మునకుఁ
గాలుని వీటికిఁ జేరనున్న నా
మతమున కడ్డుచెప్పి యవ
మానపుఁజింపున కిచ్చగింతువే 39

కలికీ ! నీకీ కష్టముఁ
గలిగింపక యాత్మహత్యఁ గావించుకొనన్
దలఁచితిని గాని కరముల
బల ముడిగెను, గత్తినైనఁ బట్టఁగఁ జాలన్ 40

వేయి వచింపనేటి కర
విందదళేక్షణ ! సత్యశీలమున్
బాయని దానవేని మును
పల్కిన దానికిఁ దప్పఁబోక యీ

సాయము సేయవే, మది వి
చారము నందక, నే ముదమ్మునన్
బోయెద స్వర్గమందుఁ గల
పుత్త్రిని జూడఁగ సత్వరమ్ముగన్ 41

అటువచియించి యొక్క పలు
కైనను దా నిఁకఁ బల్కనేర కు
త్కట పరివేదనా భరము
గ్రమ్మఁగఁ గన్నులతోన భావవి
స్ఫుటన మొనర్చుచున్న నర
పుంగవుమోమటు చూడనేర కా
కుటిల శిరోజవాని యడు
గుల్ తలఁదాల్చి తలంచె నీగతిన్ 42

ఇపుడో, యింకొక కొంతసేపటికొ, ప్రా
ణేశుండు దా నెట్టులున్
వపువుల్ పాయు, శ్రమాతిరేకముననో,
వైరి ప్రకాండైకదు
ష్కపటోపాయమువల్లనో, కనుక మ
త్స్వామీప్సితార్థమ్ము దీ
ర్చి, పయిన్ మామకదేహమున్ విడచుటే
శ్రేయమ్ముగాఁ దోఁచెడిన్ 43

అరయఁగ సాధుజీవము వ
నాంతరమందుఁ గిరాతు లొడ్డు వా
గురులకుఁ జిక్కి ప్రాణములఁ
గోల్పడుచునట్టుల దిక్కుమాలి, యా
మొఱకుల చేతఁ జచ్చుటకు
మున్న ప్రియుండిడినట్టి యానతిన్
శిరమునఁ దాల్చి స్వర్గపురిఁ
జేరుటయే కడు లెస్సయౌఁగదా 44

అని యోచించి, స్థిరీకరించుకొని య
య్యబ్జాక్షి ప్రాణేశుతోఁ
దన సంకల్ప మెఱుంగఁజేయునపు డా
ధాత్రీశుఁ డత్యాదరం
బెనయన్ బ్రేయసి మూర్ధమున్ నిమురు చ
క్లేనిన్ గృపాణమ్ముఁ గై
కొనుమా యంచుఁ బరేశుధ్యానమున మ
గ్నుండయ్యె; నొయ్యొయ్యనన్ 45

చంపతరాయం డడుగో
చంపుఁడు పొడుపుండఁటన్న సవ్వడు లపుడా
చంపక సుమగంధికి విను
పింపఁగఁ దడవేటి కనుచు వేవేగమునన్. 46

హృదయేశునాన నెమ్మదిలోన నెలకొల్పి
మొలనూలు బిగియించి కలఁతడించి
సకలైహికాశావిచార మావలఁద్రోసి
పరశక్తి నుపభక్తిఁ బ్రణుతిసేసి
సత్యమాసించి యనిత్య జీవనమొంచి
పగఱచేఁ జిక్కుట తగదటంచు
ననివార్యకార్య పర్యాలోచనము దక్క
తరవారిఁబూని తత్తఱముమాని
ఎన్ని జన్మశతమ్ముల కేనిఁ దనకుఁ
బ్రాణవల్లభుఁడతఁడె కావలయుననుచుఁ
ద్రికరణమ్ములఁ దలఁచి సాధ్వీమతల్లి
యొక్క వ్రేటునఁ బతికంఠ ముత్తరించె 47

పిమ్మట నాలతాంగి తన
ప్రేయసుతోడ నిలింపలోక సౌ
ఖ్యమ్ములఁ బొందఁగోరి తన
యాత్మఁదొఱంగెఁ గరాగ్ర చంద్రహా
సమ్మున నంతవైరి జన
సంతతి డాసియు నా యపూర్వ దృ
శ్యమ్మును గాంచి నివ్వెఱఁగు
నందుచు చేష్టలుదక్కె నొక్కటన్ 48

కోరిన వరమును దనపతి
కారీతి నొసంగినట్టి యతివను "రాణీ
సారంధా" యంద్రు యశ
శ్శ్రీరమ్యతరాంధ్ర సోదరీ మణులారా !!  49

# కవి - రవి

చండమార్తాండ కిరణప్రసక్తి నుమ్మ
లించి తెకతెకలాడి బాధించుచున్న
కంటకావృత మార్గమ్ము నంటిపోవు
కవి, రవినిగాంచి యిటు దూరఁగాఁబోడంగె

కవి—"ప్రళయకాల నిదాఘసంపాత భీత
భూతజాల మీఁ కిరీతి వాపోవ తీక్ష్ణ
భావమున నమ్మునేచుట పాడిగాదు
ఉడుకుబోతులకే క్రియనుండుఁబ్రేమ
ఏర ! మార్తాండ ! నా మీఁద నింతచలము
పూని వేధించెదవు ! మన పూర్వవైర
మిటుల సాధించుచుంటివా యేమి ? నీదు
కడుపుడుకిపోను నీగుండె కాలిపోను

రవి—"విపుల బ్రహ్మాండవేదికా విభవమెల్లఁ
దలఁచినంతన క్షణములోపలనె దగ్ధ
మొనరుపఁగఁ జాలు ననువంటి ఘనునితోడ
మూఢమానవ కీటకమునకు వైర
మా ? భళీ ! యేమిచిత్ర మాకార !! యింత
కండకావర మెందుకుఁగలిగె ? నిఖిల

లోక బాంధవుఁడను నేను నీకుమాత్ర
మెటుల శత్రుఁడనైతినో యెఱుకపడదు"

కవి—"పాంథులనుబట్టి పల్లార్చువారు తాము
సలుపు కార్యముచెడుగని తలఁతు రొకొ!
సంగనాచులవలె నేమెఱుంగనట్లు
పలుకుచుందురు తేనియలొలుకఁ 'బైకి'
రవి యెఱుంగని విషయంబు కవి యెఱుంగు
ననెడు ద్వేషంబుచేనన్ను నలఁచుచున్న
వన్నెకాఁడవుగాని లేకున్న, నేమి
దోషమున్నది నాయందు ద్యుమణి! చెపుమ

రవి—"చాలుఁ జాలును కవిగాఁడ! చాలుఁ జాలు
నీవు కవివా? నిజంబాకో! నీవు గాంచఁ
గలుగు విషయంబులను నేను గాంచలేనె?
విద్యలోనీకు నెంత వివేకముండెఁ
గవితలోనీకు నేపాటి ఘనతగలదు
బుద్ధి వైభవమున నేనిఁ బోలఁగలవు
పవనసుతు మించఁజాలిన కవివటోయి!
అతఁడు నా శిష్యుఁడౌట నీ కవగతంబె
కాని వానికిఁ గవిపేరు కలిగెనోటు!
అంతకుంబూర్వమే భాస్కరాతపమున

వాడియున్నట్టి యా కవివదనబింబ
మీనుడుల కెంతయును వాడి దీనమయ్యె
రుద్ధ కంఠస్వరమున నరుణునితోడ
నేమియో ! పలుకుటకు మోము నెత్తెగాని
మాట వెలువడదాయెను నోటివెంటఁ
దరణి వాని విషణ్ణవైఖరి దలంచి
సుప్రసన్నాత్ముఁడై పల్కెఁ జొచ్చె నిటుల

రవి— ఈ యజాండంబు లన్నియు నెవని కతనఁ
బుట్టి పెరుగుచుఁ బిమ్మట గిట్టుచుండుఁ
జంద్రుఁడును నేను నెవ్వాని శక్తిచేత
వెలుఁగు చున్నారమో ! వినువీథియందు
జగతిపైఁగల స్థావరజంగమముల
నిండెనెవ్వని దివ్యదఖండశక్తి
ప్రవిమలాపూర్వ తేజోవిలాసగరిమ
కడుపుడుకకున్న ! లోకోపకారకులకు ?
పరమదయచూపెడు మహానుభావుఁ డెవఁడొ !
ప్రకృతి కాంతామణీ చిత్రపటము నెవ్వఁ
డనుదినము వ్రాయు నూత్న భావాభిరుచులఁ
బ్రాణికోటికి నాతప బాధనడఁపఁ
జంద్రికావర్షమిడక వెదఁజల్లు నెవఁడు
జగతిలోన 'వాచామగోచరుఁ' డెవండొ !

అట్టి యఖిలాండకోటి బ్రహ్మాండనాథుఁ
డైన విశ్వాత్మునకుఁ గాక యన్యులకుఁ,
వీశ బిరుదంబు సార్థక మెట్టులగును?
అతని రచనా మహార్ణవమందు లేని
దాని నొకటైనఁ గల్పింపఁ దరముగాని
వారు పరమేశ్వరుని శిల్పవర్ణనమ్ము
సలుపునంతనె కవులైన జగతిపైనఁ
గాని జీవంబిఁకెయ్యది కలదు చెపుమ!

కవి- -సర్వమునకును గర్త యీశ్వరుఁడఁటన్న
మాటనేమరి కర్తృత్వమహిమ తమది
గాఁ దలంచుచు మితిలేనిగర్వ మతిని
భావసామ్రాజ్య పీఠికా పతులమైతి
మనుకొనుచు విఱ్ఱవీఁగుదు రస్మదాదు
లరయనేరక; క్షమియింపవయ్య! నన్ను
నీశ్వరాంశగలట్టి నిన్నెగ్గులాడి
నాఁడనో* సూర్యనారాయణా! మహాత్మ!

* శ్రీ కొత్త సూర్యనారాయణ (రవి)

# అరుణోదయము

సాంధ్య కిమ్మీర రోచిః ప్రసారసార
బహుళ సౌందర్యపటలప్రభాసమాన
లలితలావణ్యయుత నభోలక్ష్మికతనఁ
బ్రకృతి శోభాప్రపూర్ణయై వరలు నపుడు 1

లోక బాంధవుఁ డను కీర్తిలోనఁ దనకు
భాగము నొసంగకయు, గర్వభావ మూని
తనరు దినమణి ముదుసలితనముఁ గాంచి
హేళనము సేయు తలపున హిమకరుండు 2

సమధికోత్సాహ పూరిత స్వాంతుఁ డగుచు
నీలమేఘాంబరమ్మూఁది నిఖిలలోక
హృదయ పరితోషదాయియై పొదలుచున్న
గగన సీమంతినిఁ గూడి కాంచు నపుడు 3

దేశసేవ యొనర్పఁగఁ దిరిగి తిరిగి
మాతృభూమికిఁ జనుదెంచి మఱలఁ గృష్ణ
వేణియును, దుంగభద్రయు, వేడ్కమీఱఁ
గలసి గానామృతమ్మును జిలుకుచోట 4

ఆ ప్రశాంత మనోహర మైన వేళ
ఆ వినిర్మల వాయులహరులలోన

ఆ సిత స్నిగ్ధ వాఃప్రవాహంబుచెంత
ఆ మహా పుణ్యభాజన భూమియందు 5

కల్ప నానల్పభావనా కలిత లలిత
వలిత పరివేష చకచక్రభ్రమణమునకుఁ
జెదరి చీకాకు చెందిన హృదయవేది
శాంతి దేవతనెలకొల్ప సంభ్రమించి 6

గండభాగాగ్రమున మృదు కరముఁజేర్చి
కవికుమారకుఁ డొకఁ డేకాంతలీల
నచటి సైకతతలమున నధివసించి
శ్రాంతుఁడై తాను ప్రకృతివిభ్రాంతుఁ డగుచు 7

మంద మంద సమీర నిష్యందమాన
కందళిత చారుగంధనిష్పందరుచిర
మాలికాఘ్రాణసంభూత మహిత - విహిత
హర్ష వారాశి డోలావిహార మొనసి 8

తన్నదీకాంత పరిసరోద్యానతతులఁ
దన్నదీభాగ మృదు సైకతముల గములఁ
దన్నదీప్రతిబింబిత ధవళకిరణుఁ
దన్నదీప్రోత్థ వీచికాధ్వానములను 9

కనుగొనుచు - వించుఁ - బులకితగాత్రుఁ డగుచు
నిర్భరానంద మగ్నుఁడై నిర్వికల్పు

విశ్వ నిర్మాణ చాతురీ విధము పెంపు
భావసామ్రాజ్యవీధులఁ బదిలపఱచి 10

హే! పరంజ్యోతి! పరమాత్మ! హే! మహాత్మ!
హే! సగుణ నిర్గుణ బ్రహ్మ! హే! ప్రకాశ!
హే! చిదానంద సద్రూప! హే! మహేశ!
హే! పరాత్పర! నిఖిల లోకేశ! యీశ! 11

అనుచు వేదాంతవేద్య నామామృతంబు
తనివిదీఱంగఁ గ్రోలి యాతని యపూర్వ
గగనపత్రస్థ లేఖనాకౌశలంబు
నద్భుతానంద గరిమతో నరయుచుండ 12

అచ్చోటున కత్యనతిదూరమునఁ గలుగు
నంబికానాథు కనకంపుటాలయాగ్ర
భాగమందున స్థాపింపఁబడిన రత్న
ఖచిత రమణీయ శిఖరంబు గానిపించె 13

నవనవోన్మేష సురభిళ నవ్య పారి
జాత దివ్య ప్రసూన గుచ్ఛములనుండి
దాని మృదువీచికా ధగద్ధగల వెలుఁగు
క్రమతర కాంతి పూరముల్ గాంచుచుండి 14

చిగురు జొంపమ్ములను మెక్కి చెట్లమీఁదఁ
గుహు కుహూ ధ్వానములొనర్చు కోకిలాంగ

నామణులతోడఁ గలసి యానంద మెసఁగఁ
దానుసైతము పాడఁగాఁ దలఁచి మదిని 15

నిరుపమ నితాంత మాధురీ నిస్వనమున
మలయమారుత గీతాల శిలలు గరఁగు
నటుల, నాలాపనముసేయు చిచట సతఁను
తన్మయావస్థలో నున్న తటిని దరిని 16

* * * * *

హా ! హాతోస్మి ! హాతోస్మి ! నన్నాదరింపుఁ
డనుచు గద్గదస్వరమున నబల యొార్తు
చేయు నార్తనినాదంబు చెవుల సోఁక
లలిత గానస్రవంతిని నిలిపి యతఁడు 17

వెనుదిరిగి చూడ - భువనమోహాన కళావి
లాస లావణ్య నిస్తుల లలన యొార్తు !!!

* * * * *

తఱమి కఱచెడు పెనుకోడెత్రాఁచుభంగి
కరకశస్త్రాంతుఁ డొకఁడు... ...తత్కన్యవెంట 18

* * * * *

"నిలు ! నిలువు ! మెందు బోయెదో లలన !" యనుచు
నా దురాత్ముఁడు..."ననుఁ గావరాదె ?" యనుచు

నా మహాశగమనయు..."నన్యాయ ముడుగు!"
మనుచు నున కథానాయకునంతికమునఁ...!!! 19

కంటక శిలా ప్రకీర్ణమా కటికి నేలఁ
బరుగు పరుగున గుండియల్ పగులునట్లు
లలసి వచ్చిన యాలేమ తెలివిదప్పి
మొదలు తెగిన తరువువలె భూమివ్రాలె 20

అంతలో "భర్తృదారికా" యను నిసర్గ
నిస్వనం బొండు పఱతెంచె నింగినుండి
యది వినిన యాశకుండు తా నప్పు డపుడె
కన్మొఱఁగి లీనమైపోయె గాలిలోన 21

తద్విష వ్యాసవర్తనఁ దనిలి తుదకు
కవికుమారుఁడు చకితుఁడై కడలుకొన్న
విస్మయంబున వెనుకంజవేసి నిలిచి
యా యపూర్వపు దృశ్యంబు నరసి యరసి 22

స్తంభితయయి యస్ఫుటస్వరముతోడ,
"అకట! యీమందభాగిని యవనిపాల
తనయయా యేమి! చెప్పుమా!" యనుచు వెలలి
యా నదీజలమును గొని యరుగుదెంచి 23

నిస్పృహావస్థలో నున్న నెలఁతమోము
దమ్మి శీతలజలమునఁ దడిపి నంత

ముకుళితములగు నేత్రాబ్జములను విచ్చి
తనయెదుట నున్నవాని నా తరుణి కాంచి   24

తెలివిమై తొట్రుపాటున నిలిచి, వికృత
భావమున, మృగయుని వాతఁబడిన హరిణ
శాబకమువోలె వణఁకుచు, సంభ్రమమునఁ
గులుకుఁబయ్యెద సవరించుకొనుచునుండ   25

"ఓ! యపరిచితాపూర్వ మహోజ్జ్వలాంగి!
నిన్నుఁ దలుముకొనివచ్చిన నీచుఁ డెవఁడో!
ఈవెవరో! నేను వినఁదగునేని భయముఁ
దొలఁగి వచియింపు"మని నిల్పి పలికె నతఁడు   26

గుండె చెదరిన ధాటచేఁ గొంతదనుక
నేమియుఁ బల్కలేకున్న లేమఁ గాంచి
"భర్తృదారికవా? నీవు బాల!" యనుచు
నప్రయత్నంబుగను బల్కె నతని కతివ   27

"ఔను; దమకెట్లు దెలియంగనయ్యె నార్య!
మీరు కవివర్యులా? దయగూరి నన్నుఁ
గావ వచ్చిన మహనీయ దేవతాప్ర
భువులరో?" యంచు నిట్టూర్పుఁ బుచ్చు చనియె   28

"అబల! నా యుదంతం బెల్ల నవల నీకుఁ
దేటతెల్లంబుగా నిదే దెలియఁజేతు

భాస్కరుఁడు పశ్చిమాంబుధిఁ బడకమున్న
ఇల్లుఁ జేర్తును నడువవో యింతి యన్న" 29

అంత వనమార్గమున నిర్వు రరుగుచుండ
సంజకెంజాయ లల్లన సమసిపోయెఁ
జరమవార్నిధిఁ గ్రుంకెను జలజమిత్రుఁ
డభ్రమండలి మేఘంబు లావరించె. 30

కిసలయాగ్రంబు లాపోవ మెసవి బయళ్లు
లందు స్వేచ్ఛగ హాయిగా నంతదనుకఁ
బ్రవిమలసుధార్ద్రగీతముల్ పాడినట్టి
కోకిలాంగనలందంద గూళ్లు సేరె. 31

క్రమముగా నాకసంబెల్ల కాలమేఘ
పటలిచేఁ గనుమూసెఁ దత్ప్రాంతప్రకృతి
రమణి తేజంబు గోల్పోయెఁ దమమెసంగు
కారణంబున, నొక క్షణకాలముననె. 32

హిమహరుని హేళనముసేయ నేఁగుదెంచు
హిమకరుం డిప్పు డెచ్చోటి కేఁగినాఁడొ ?
పరుల యున్నతి కోర్వని పాపివోలె
స్వీయనాశన మందెనా చేవఁ దొఱఁగి. 33

చిమ్మ చీఁకటిలోఁ గన్ను చిల్చుకొన్న
దారి కనఁబడనట్టి యా తరుణమందు

వారలేరీతి నడచుచున్నారొ యద్ది
వారి హృదయాలకే బోధపడకయుండె 34

పండుటాకుల మర్మర ధ్వనులు సన్న
వాటె, ఝంఝానిలోద్వేగ పటహా నివహా
భాంకృతుల భీతుగూడిచి యా ప్రళయగర్భ
కుహరములలోన శోకమ్ము గ్రుంకునేమొ ? 35

అంతకంతకు ధ్వాంతము లతిశయిల్లె
జలధరారావ పటలంబు శ్రవణములను
బ్రద్దలొనరించుచుండె ; - నప్పట్ల నెమిలి
గములు పురివిప్పి యాడెనో - కాక లేదొ ? 36

కుంభవృష్టిగ వర్షంబు కురియసాఁగె ;
అశనిపాతంబు లగుచుండె నచటనచట;
మొనసి యపుడప్పు దలయెత్తికొని బయళ్ళఁ
దొంగి చూచుచు నుండె ; విద్యుల్లతాంగి 37

ఆ మహాభయంకర నిబిడాంధకార
మందు ...నా హోరుమను గాలియందు...నా య
సహ్యమైబీతుగొల్పు వర్షంబులోనఁ
గంటకాకీర్ణ మా బాట వెంటనంటి 38

అలసభావంబుచే నొక్క యడుగునేని
మోపఁజాలక నిలచిన ముగుదఁ గాంచి

మిగుల దుఃఖభరంబునఁ బొగిలి పొగిలి
ఆర్ద్రహృదయంబుతో నతఁ డనియె నిట్లు 39

"ఎన్నఁడేనియు నెండకన్నెఱుఁగనట్టి
యమల శుద్ధాంతముల నడయాడు నీకుఁ
గటకటా ! నేఁటికీ ఘోరకాననమునఁ
గష్టమొదవెను దైవసంఘటనకతన" 40

"ఐన, నిట్టివంటి సమయములందె యోర్పు
పూని వర్తింపవలయును మానవాళి ;
అరుదుగా నీశ్వరుం డిట్లె నరులఁ గఠిన
ముగఁ బరీక్షించుచుండును బూవుఁబోఁడి" 41

"నీ విషాదస్థితిఁ గని నేనొకింత
నీరువెట్టక నిలువంగ నేరకుంటి
నట్టివాఁడను నినుఁ దాల్మి నందు మనుచుఁ
బలుకవలసె, క్షమించి నా పలుకు వినుము" 42

"ఇంక ముందున కొకఁడుగేని యిడఁగఁ
జాలకున్నావు, నీకు సంశయము లేని
యెడల, మద్భుజపీఠిపై నెక్కు ; మెట్లో
గీముఁ జేరుతు శ్రమఁ బరికింపకుండ" 43

"కష్టసమయంబులందు, నకల్మషంపు
వర్తనుల సాయమర్థింపవచ్చు నబల

అంతమాత్రంబుచేఁ బాప మంటఁబోదు
మనము దిటవ్రుగనుండెడి మఱవలకును" 44

అని వచించెడి నాతని కతివ మిన్న
మరల నీరీతి వాక్రుచ్చె "మాననీయ !
తాము వచియించునది యథార్థంబెయగును
గాని నే సమ్మతింప నిక్కా-ర్యమునకు" 45

"ఏమనఁగ, నన్ను రక్షింప నేఁగుదెంచి
నట్టి భవదీయ భుజముపై నధివసించి
కష్టపెట్టంగఁజాల నన్గనికరించి
కరము నందిమ్ము నీవెంట నరుగుదెంతు" 46

మాఱుమాటాడఁజాల కమ్మగువ మృదుల
కరము కరమునఁ గీలించి, కవివరుండు
నడచుచుండఁగ నాతని యడుగుజాడ
వెంటఁ జనుచుండె మెలమెల్ల వెలఁది మిన్న 47

ధరణిసతి బొజ్జ నిండంగఁ ద్రావి, విడచి
పుచ్చినటువంటి యా వర్షపుఁ జలంబు
వారల కటిస్థలంబుల వఱకువచ్చి
యేరులై వెల్లివిరియుచుఁ బాఱఁదొడఁగె 48

ఎట్టులోఁ బెన్నులాడుచు నిద్దఱల్లె
యరుగుచుండిరి యాప్రవాహంబు నంద

యసువులను లెక్కసేయక, యక్కటకట!
యేమిగానున్న వారలో యెవరి కెఱుక? 49

చని చని యొక రసాల వృక్షంబు సరసఁ
జేరి పెన్నిధిఁ గన్నట్లు చెప్పరాని
ముదము గదురంగ నిలచిరి, ముందు నడువఁ
జాలమని యెంచి తమ తమ స్వాంతములను 50

ఉన్నత స్థాన మందున నున్న నార
సాల భూజము వారి కాశ్రయ మొసంగి
'వర్ష బాధ' నివారింప హర్ష మెసఁగి
అతనితోఁ దిన్నఁగా నిట్టులనియె సతివ 51

"అపయశప్రాప్త మరణంబు నందనున్న
నబల నగు నన్నుఁ గాపాడ నరుగుదెంచి
యీ విపద్వారినిధిఁ జిక్కెతెటులఁ దీర్తుఁ
దావక ఋణంబు నో మహోదారచరిత!" 52

"అస్మదరింపుఁడు వచ్చియింతు నస్మదీయ
నిరవధిక దుఃఖసంతప్త నిష్ఠురోగ్ర
గర్భనిర్భేద కారకకష్టభరిత
చరితమెల్లను సావకాశముగ వినుడు" 53

"శౌర్యనిధియును గుణనిధి శాంతినిధియు
అమలకీర్తి ధురంధరుఁడైన యుదయ

పురవిభు యుదయసింహుని పుత్రినగుదు
నుదయ లక్ష్మి! యటంచుఁ బల్కెదరు నన్ను 54

"విశ్వవిశ్వంభరాత్ము సేవింప నతని
యాలయమునకు నేఁటి మధ్యాహ్నసమయ
మందు నరుదెంచి సాయాహ్న మగుటఁ జేసి
తత్సమీపవనమునకుఁ దరలి యచట 55

"సఖులతో శీతలద్రుమ చ్ఛాయలందుఁ
గలసి విహరించి యభ్రమండలిని సాంధ్య
రాగ ముదయించు టెఱిఁగి యారామసీమఁ
బుష్పములుగోయ వేర్వేరఁ బోవు మమ్ము 56

"కాంచి నా మేనమఱఁదియగా ఖలుఁడు నన్ను
జూసి మద్రూప ముగ్ధుఁడై వాసిదొరఁగి
పైఁగ గాంధర్వమునఁ జెట్టపట్టు మంచుఁ
బలుకు పలుకులు చెవులకు ములుకు లగుట" 57

"క్రుద్ధమానసనై వాని కూళ తనము
నడఁపఁగా నెంచి యేమేమొ యంటి నప్పు
డనునయాలాప మిసుమంతయైనఁ గాని
బని యొనర్పమిఁ జేసి నిర్భయత గూరి" 58

"అస్మదీయ వచోలీల లగ్గిపైనఁ
దైలమును జల్లినట్టు లాతని మఱింత

రెచ్చగొట్టిన కతమునఁ బెచ్చుపెరిగి
కల్లుద్రావిన పరుష మర్కటమువోలె"                59

"వెడఁగుఁ దనమును దాలిచి యొడలుపైన
నెఱుగ నేరక తన్నుఁదామఱచి నన్నుఁ
గ్రొవ్వి యేమేమొ కారులు కూసె నకట
కామదాసులకిల వివేకంబు గలదె!"                60

"పిలుచుటకు నైన నెవ్వరు పలుకునట్టి
స్థలముగాదది రాణివాసంపుఁ కోఁట
నొక్క చెలియైనఁ జెంగట నుండియున్న
నిట్టి విషమపరిస్థితి పుట్టదేమొ!"                61

"దుస్సహానురంత దుర్మద దుష్ప్రతాప
వారినిధి కడ్డుకట్టను వైవనాను
సన్నిధానంబునందు నా సమయమునకు
నొక్క చిన్ని కటారి యే నుండదాయె"                62

"శాపఫల మివ్విధంబున బైటఁబడెను
యోగముండఁగ మఱియొకలాగదేల
జరుఁగఁగల దార్య! యా పాపచరితుఁడంతఁ
గౌఁగిలింపఁగఁ బైఁబడఁగాఁ దొడంగె"                63

"చేయునది లేక నేనప్డు శీఘ్రగతిని
బరుగులెత్తుచు వచ్చి నీపాలఁ బడితి

అంత సత్యావతీశయ మెట్టు లమరెనొక్క-
యవ్వలి కథాక్రమంబు నీకవగతంబ" 64

తల్లిదండ్రులు లేని యాతని మదీయ
జనకుఁడే పెంచి పెద్దవాని నొనరించి
యింట నిడుకొన్న యందుల కీవిధంబు
సలిపె నీక నేమి నానోటఁ బలుక వలయు" 65

"ఎంత భాగ్యంబు గలిగిననేమి ? యెంత
పరిజనానీక ముండిన ఫలమదేమి ?
ఫాలభాగంబుపై వ్రాయఁబడినరీతి
ననుభవింపక త్రోయరా దార్యవర్య" 66

గద్గదిక చేనొకించుక కల్లువోవు
గొంతుకన్ గేల సవరించు కొనుచు నుదయ
లక్ష్మి తనకథ కవికుమారకునితోడఁ
బలుకుచుండఁగ నీలాభ్రభాగమందు 67

అలముకొని క్రిక్కిఱిసియున్న యాప్రగాఢ
ఘన వితానము పంచబంగాళమయ్యెఁ
జండ వాతూలబాహు సంస్పర్శనమున
వర్షధారోద్ధతియు సన్నవాఱెనంత 68

ముక్తబంధనుఁడై పెఱమోముఁజూడఁ
గొందలంపడి విధిలేక కుంటి నడల

నడచు చోరునివలెఁ జంద్రుఁ డడుగులోన
నడుగుపెట్టుచు వినువీధి నవతరించె 69

పండి పక్వమ్మునకువచ్చి బ్రద్దలయిన
దాడిమ ఫలమ్ములోని విత్తనములట్లు
లభ్రవీధిని స్వేచ్ఛావిహారమపుడు
సలుప వెడలెను తారకా సముదయంబు 70

బంధువులనుండి విడఁదీయఁ బడినవాఁడు
మరల నాత్మీయులను జేరి మురియు పగిదిఁ
దారకాపతి తారకా దర్శనమున
మందహాసంబొనర్చె నానంద మెసఁగ 71

# ధిక్కారము

అన్న యటంచు లోఁ దలఁప
కర్కట 'సంగుని' రాజ్య కాంక్షమైఁ
గన్నులు తోడి నావు గద!
కశ్మలమానస! యాతఁ డెందుకో
మన్నన సేసి పీడెను బ్ర
మాద వశమ్మునఁ బృథ్విరాజ! నీ
పున్నెము పుచ్చి పోయినది
పో! యిఁక నేమి యొనర్తు రెవ్వరున్

ఆతఁడు శాంతమూర్తి స్సుగు
ణాఢ్యుఁడు బంధుజనాదరుండు ప్రే
మాతుర మానసుండు విన
యాధికుఁ డౌటయు నిన్నుఁ బోలె పై
పూఁతల వాఁడు గామిఁ బలు
పోకలు పోయితి గాని లేనిచో
నీతలఁ దీసి యుండఁడె వి
నీతికిఁ జొచ్చెను గాక దుర్మతీ!

"సంగుఁడు రాజ్య మేలుటకుఁ
జాలని శక్తి విహీనుఁ డౌట రా

జ్యాంగ విచార వేత్తగ స్వ
యంభువు నన్నుఁ సృజించె నీ ధరా
రంగము నేలు మం" చని ని
రంతర మెల్లరి చెంత నెట్టు లో
పొంగలి మాట లాడెదు ని
వేక విహీనత నెల్ల వారిలో 3

ఆ లలితాంతరంగుఁడు ద
యా గుణ పూర్ణుఁడు గాన మున్ను నీ
వాలకముం గ్రహించి తన
స్వార్థము మాని సహోదరుండవన్
లోలత పై కొనం నిను వి
లోకనఁ జేసి "యిలాతలమ్ము నీ
వేలుకొనంగ నిత్తు" ననఁ
డే కను లేటికిఁ దోడి నాఁడవో! 4

జనకుఁడు రాయనుల్లుఁడు వి
శాల యశోనిధి చావ లేదె? యా
తని వెనుకం ధరాతలము
దక్కుట న్యాయము పెద్ద వాని కే
మని యడుగంగఁ జాలితి వ
యారె! వయో గుణ దూరగుండవై
నిను. జననాథు సేయు మని
నీతి నెటుల్ పచరించినాఁడవో! 5

# స్మృతి

నిక్కపు మిత్రరత్నమ! వి
    నిర్మల చిత్తుఁడవైన నీవు నా
కెక్కరణిఁ లభించెద విఁ
    కేగతి నూరడిలంగనేర్తు? నీ
పోక్కడి మానసం బెటులఁ
    బొందుఁ బ్రశాంతిని పాడుమిత్తి దా
నెక్కడ దాపురించె? మన
    కిర్వుర కీయెడఁ బాటుఁ గూర్పఁగ    1

అనితర సౌఖ్యజాలముల
    కాకరమా దివిజేంద్రు పీటికిఁ
జని, సుఖయించుచుంటివె? వి
    చార నిమగ్నుని జేసి నీదు మి
త్రుని నను, నింక నేగతిని
    దుర్భరమై యనివార్యమైన యీ
వనటను మాన్పుకొందు నిను
    వంటి హితుం డెటులబ్బు నాకిఁకన్!    2

గాదిలిమిత్ర! నీ కిటు ల
    కాలపు దుర్మరణంబుఁ గూర్చి, స

శ్రీ౧౦

మ్మోదమహీజరాజము న
మూలముగాఁ బెకలించినాఁడు ని
ర్వేద భరంబుచే నవయు
రీతిని మాకు ఘటింప నీశ్వరుం
డే దయమాలి; యీ గతికి
నేగతిఁ దాళఁగలాఁడ నక్కటా !! 8

ఒక నిముసంబు నిన్నుఁగన
కుండిన నీ యెడఁ బాటు కోర్వ నే
రక, మదిఁ దల్లడిల్లెడి తె
ఱంగు నెఱింగియు మాలదైవ మో
ర్వక కనుగుట్టి దుర్భర దు
రంత నితాంత వియోగవహ్ని నీ
రకముగ నాకుఁగూర్చెను, ద
రంబె భరింపఁగ నాకు నిమ్మహిన్ 9

"ఎట్టి రహస్యమైన నొక
యించుక దాపఁగ లేని యద్దపుం
బెట్టి విధంబునన్ దనరు
వీని మనంబని; లోకులంద్రు ని
న్నట్టిది యో నిజంబయిన
హా ! యిసుమంత వచింపకుండ నీ

వెట్టు సురాలయంబునకు
నేఁగితి వొంటరిగాఁ గృతఘ్నుతన్ 10

ఎఱిఁగియు నెఱుఁగక కరుణారసము వీడి
చలిచీమకును బాధసలుప వెపుడు
పరుల నొవ్వఁగఁజేయు పరుష భాషణములఁ
దెలియక కలనైనఁ బలుకవెపుడు
తీవె యిల్లాండ్రకుఁ దీవ్రవేదన యని
కుసుమమ్ములైనను గోయవెపుడు
జాతినీతినొకింత యూఁతగాఁగైకొని
యెవ్వారి ద్వేషించి యెఱుఁగవెపుడు
అట్టి కోమలమానసు, నట్టి సుగుణ
ఖనిని, నిను మృత్యుసతి ముఖగహ్వరమునఁ
గూలఁద్రోయఁగ నేరీతి పాలుపడె, వి
ధాత యింతటి నిష్ఠురత్వమ్ముదేల ! 11

* పి. కుమారస్వామి

# ప్రణయాశ్రువులు

ప్రణయ విపంచి తంత్రులు బ
రాబరిగా శ్రుతి గొన లీనమై
తనరఁ బ్రమోద గాన పర
తంత్ర భరమ్మున నిష్కళంక జీ
వన కమలాకరంబున వ
నారణ కేళి జరించు కే జతన్
గని కను గట్టి దైవము ని
కల్పు మొనర్చెను సంధి సూత్రమున్ 1

లలిత మృణాల పల్లవము
లన్ బురుడించు త్వదీయ బాహు డో
లల నిదురించి దీక్ష నిశ
లన్ హృదయ ప్రియమైన స్వప్నపుం
గలశ పయోనిధిన్ బ్రణయ
గాన కళాప్లవ సంస్థితుండనై
మెలఁగు నదృష్ట మెన్నఁడు స
మీక్షణ సేయునో నన్నుఁ బ్రేయసీ! 2

జలధి చలత్తరంగ కణ
సంచయ లీన విభాకర ప్రభా

కలితకలాకలాప మటు
గా భ్రమియించెడి మన్మనంబు శాం
తిలు నను నాసమాసె సుద
తీజనరత్నమ! నీదు కన్నువె
న్నెల గురియించి నీ ప్రణయ
నీరధిలో నను దేర్ప రమ్మిఁకన్ 3

తొలకరి మించు దీవియల
తో నెకసక్కెము లాడు నీ తనూ
జ్వలరుచిరాంశు మండలి, ది
శా ముఖ సీమలఁ బ్రాఁకి నాట్యముల్
సలుపఁదొడంగి మద్హృదయ
శాంతి పటమ్ము దహించు చుండ నో
యలికులవేణి! ఏ గతిని
రర్థక జీవన యాత్రసల్పెదన్ 4

పండిన శాల్మలీ ఫలము
బ్రద్దలు వాఱఁగ దాని గర్భ మం
దుండెడి దూది తీవ్ర పవ
నోద్ధతి చే గగనోర్విఁ బాఱున
ట్లండజయాన! నాదు హృద
యాబ్జ దళమ్ములు విచ్చి వ్రాలి యా

రెండల వాడి వత్తలయి
　　　　మేటికిఁ గోటికిఁ బన్నెతెరల్　　　　5

తేట మొయిళ్ల సందడు లు
　　　　దీర్ణ మృదంగ ధణం ధణార్భటిక్
మాటికి మాటికిన్ శ్రవణ మార్గమునింక
　　　　మయూర బాలికల్
పాటలు పాడుచున్ బుగుల
　　　　పై కెగఁబట్టి విలాస నృత్య భో
గాటనఁ దేలు లీలఁ గన
　　　　నశ్రుకణమ్ములు జారు పారెకున్　　　　6

కాలము వోక యిర్వుర మ
　　　　ఖండ ముదబ్ధిని మున్గి యాడుచున్
గాలిఁ బసిండి సౌధములు
　　　　గట్టి చరించెడి వేళ నీదు కెం
గేల మదీయ హస్తము ల
　　　　గించుచు సౌఖ్య పరంపరా రతిన్
దేలిన వృత్తముల్ ప్రియ స
　　　　తీ! తలఁపోసి కరంగి పోయెదన్　　　　7

నీల సరోవరమ్మున వి
　　　　నిర్మల భావ తరంగ మాలికా

డోలలఁ దేలి యాడుచుఁ గ
డన్ దమినాథుని యంకసీమపై
సోలఁగ, నుల్లసిల్లి తన
సోయగముల్ ప్రకటింపఁ బద్మినీ
బాల తరంగలించెడి ప్ర
భాత ముఖంబుల నిన్నుఁ బాడెదన్ 8

ప్రణయ నికుంజ పుంజముల
పజ్జ నితాంత వియోగ గీతికా
స్వనములు మాఱు మ్రోఁగఁగఁ బ్ర
శాంతి దొఱంగిన యార్తు లీ క్రియన్
గనుఁగొన లుబ్బ నేడ్పు టధి
కార పదస్థుఁడవైన నీ కెటుల్
వినపడ దిట్టి దంపతుల
వేచుటె నీ పనియా! దయానిధీ! 9

# తరనము

శాంతిమయుల జనకుల - నిత్యసత్య వరులఁ
పరహితార్థుల - ధర్మసంబద్ధమతుల
నియమశీలుర - నిగమార్థ నిపుణయుతులఁ
గోష్ఠితరబడి సృజియించుమొక్క నీవు
నేమసంస్కృతి గర్జనోయీ? మహేశ!
ఎందులకోగాని తనువు సృజించినావు
కవుల, గాయకులను, పటాగ్రణుల, శిల్ప
చతురులఁ బదార్థతత్త్వ విశారదులను,
పండితాఖండలుల, యశోమండనులను
బహుళకృతులఁ గా సృజించి నన్నె వారిమధ్య
సిగ్గుపడి చచ్చునట్లు సృష్టించినాఁడ
వంత నిర్ఘృణహృదయుఁడ వైతివేల! 1

ఆకాశకల్యాణి కట్టి నైర్మల్యంబు
తారకాసతి కట్టి ధవళిమమ్ము
అచలనాయకమణి కట్టి స్థిరోన్నతి
ధారాధరము కట్టి దానకలిమి
వనలక్ష్మి కట్టి సేవాపరాయణతయు
నీరధి కట్టి గంభీరగరిమ

క్ష్మాదేవి కట్టి ప్రశాంత స్వభావమ్ముఁ
ప్రకృతిసుందరి కట్టి ప్రణయరక్తి
కరుణ వెలయంగనొసఁగి నా కడకువచ్చి
మూతిముడువక గట్టిగా ముడుపుఁ గట్టు
కొనకపోయిన నీకొంపకూలు నాకొ!
సర్వసమవర్తి కీవిలక్షణము లేమి! 2

సార్వభౌమత్వ మొసంగ నేరని దేల
మొనలేని కోరిక లీయవలయు?
సిద్ధార్థుగాఁగ సృష్టింపనేరని దేల
యీయయాచిత జన్మ మీయవలయు?
సర్వజ్ఞమూర్తిగా సలుపనేరని దేల
నిఖిల కళాసక్తి నింపవలయు?
చిత్త సంస్కారమ్ము సేయనేరని దేల
పాపపుణ్యమ్ము లేర్పఱపవలయు?
ఇట్టి నీతప్పు నీవు గ్రహింపలేక
స్వమతమార్గాను గామినై చనెదునన్ను
రేపు నీ కొల్వులో విచారింతు వంట
యే మొగము పెట్టుకొని తీర్పులిత్తువయ్య! 3

నీ కనుసన్న లేకయవ
నీ స్థలిపైఁ జలిచీమ యేనియుఁ

ప్రాఁకఁగ నేరదన్న నీక
మాదృశుచేతల కేరు కర్తలో
నీకు గ్రహింపరాని దోషా !
నెవ్వగలన్ బొగులంగ సేతు వ
న్నా ! కరుణావిహీనత ది
నంబున కొక్కొక నూత్నపద్ధతిన్ 4

సృష్టికిం బ్రతిసృష్టిఁ జేసి నీ కీర్తిని
గొనగోటితోఁ జూఱకొందుననియొ
కులనామ రూపాది గుణహీనుఁడవని
వింతవారలకుఁ జాటింతు ననియొ
గుట్టుగాఁ దలఁదాఁచుకొన్న చోరుని నిన్ను
నెల్లరికిన్ బట్టియిత్తుననియొ !
కడఁగి నీవొనరించు గారడీపన్నాల
కంతరార్థము లేర్పరింతుననియొ
పొలకువను బట్టినావు గాఁబోలు, నాకు
శక్తియుక్తుల నీయ కశాశ్వతంపు
జన్మ మొక్కటిమాత్ర మొసంగియుంటి
వెంత దూరైక దృక్కవోయీ మహాత్మ ! 5

స్వీయ ప్రయోజనాభి రతి
చేత ముఖస్తుతు లిచ్చకమ్ములన్

గూయు స్వభావ మింత వఱ
కుఁ గలనైన నెఱుంగనట్టి నేఁ
బాయని భక్తినిన్నుఁ గొలు
వఁ బనియేమి ? స్వకీర్తనాభిలా
షాయత బుద్ధినై ఫల మొ
సంగెడి దాతకు జోతలిత్తునా ! 6

తనువు ధరించి నందులకు
తప్పదు చావక నేఁడో ! రేపొ; కా
వున స్వమతార్థ భోగములఁ
బ్రొద్దులుపుత్తు విశృంఖలమ్ముగా
దినమొక లిప్తమాదిరి ప
డింబడిగా నిపుడడ్డరాకు నీ
పని యెటులైన జీవములఁ
బాసిన పిమ్మటఁ దీర్పకుందునా ?

పుట్టుగ్రుడ్డిగ నేల పుట్టింపవో పర
తరుణులపైఁ జూపుఁబఱపకుండ
అంగవైకల్యమ్ము నమరింపవేలొకో
పోరాని యెడలకుఁ బోవకుండ ?
షండునిగా నేల జన్మింపఁ జేయవో
కామునిధాటి పోకార్చుకొఱకు ?

బధిరునిగా నేల ప్రభవింపఁ జేయవో

  యొరులతప్పుల వినకుంటకొఱకు ?

మూకగా నేల సేయవులోకమందుఁ

దప్పు వాకొనకుండ వేదాంతవేద్య !

తప్పునీదని నాకడ నొప్పుకొనుము

నన్నుఁ దెగడఁగ నేటికో కన్నతండ్రి ! 8

# నటరాజు

పర్యాప్తంబగు నీదు దివ్యనటనా
　　ప్రాగల్భ్యము న్గాంచి, త
త్పర్యాయోక్తికి మెచ్చి, యాఁదలల నూ
　　పఁగ మాను వారెవ్వరీ
యార్యావర్తము నందు లేరుగద వి
　　ద్యాధుర్య ! శ్రీ రాఘవా
చార్యా ! సద్గుణవర్య ! నాటక కళా
　　సామ్రాజ్య పీఠాధిపా! 1

ఆర్యుల్ హూణులు నైక కంఠ్యముగ వ
　　హ్వాయంచు నీ నాట్య చా
తుర్యంబుఁ గొనియాడు చుండెదరు చే
　　తోమోద మొప్పార నా
యార్యా నాథుఁడపారప్రేమ గను ని
　　న్నత్యంతముఁ రాఘవా
చార్యా! సద్గుణవర్య ! నాటక కళా
　　సామ్రాజ్య పీఠాధిపా 2

మందస్మిత ముఖారవిందంబు నందంబు
　　జాబిల్లితో నెకసక్కె మాడ

విద్యానవద్య వివేక సంపత్ప్రసిద్ధి
అఖిలాంధ్ర దేశము నావరింప
సరస వాగ్వైఖరీచాతురీ మాధుర్య
మెల్లరి హృదయముల్ కొల్లఁగొట్ట
భవ్య నాటక కళా పాండితీ వైదుష్య
మఖిల నాటక వేత్త లాదరింప 3

సర్వ సమతయు, సద్గుణ సముదయంబు,
శాంతి, దాంతియు, నిరుపమ సాధువృత్తి
పెట్టని విభూషలై నీకుఁ బెంపునింప
నోయి! నటరాజ నెగడు మాంధ్రోర్విలోన 4

* బళ్లారి రాఘవాచార్యులు

# శుచి

నీలనీరంధ్రనిస్తుల నీరదంబ!
వెను దిరిగిచూడ, కంబరవీధి - స్వకుల
సంగతింబాసి యంత స్వచ్ఛంద గతినిఁ
బరుగు లెత్తెద వెవ్వరికొఱకొ చెపుమ? 1

విధి, విరామమ్మెఱుంగ కీ వింతరాత్రిఁ
జాడ తెలియని దుష్పథశ్రమకుఁ జిక్కి-
బడల నేమిటి కెవరైన బత్తెమొసఁగి
ప్రాణ సఖులకు వార్తలు పంపినారె? 2

మన్మనో వేగమున నభో మార్గమంటి
యనిలతస్కరు భయమైనఁ గనక చనెదు!
రక్తిరతులైన యే విప్రయుక్త 'యువక'
మిథున సంధాన భరము నీ మీఁద నిలచె? 3

వారి వాహకులెపుడును ప్రణయవార్త
కలుగ, మెలఁగుట నే నెఱుంగుదును గాని
కామరసలోల జనమున కన్న నింత
సమయ శుద్ధికి వెఱువని చంద మెఱుఁగ? 4

సాహసోన్మాద పారవశ్యమున మునిఁగి
గుర్విణినఁటన్న సుంత సంకోచమైన

లేక ప్లుతగతిఁ బఱువెత్తె దేక సరణి
గర్భ గత పిండ మవిసి నీ గ్గారి పోదె? 5

అనవరతమును జీవనాభ్యంతరమున
నిదుర వోయెడు నాకంట నిప్పువెట్టి
సన్న సన్నఁగ మత్పతిజ్ఞ సంగమించి
వలపు గ్రుడ్డిదియనుమాట నిలిపినావె? 6

గంగలో ముంచి నీ కూఁతు కాఁపురంబు
నల్లునకు భోగ కామినివగుచు నిష్ఠ
డేమి మాటను గట్టితి విల్లువెడలఁ
గొట్టఁ బడుకంటె? గర్భమ్ముఁ గొన్న వెనుక 7

కులముఁ దిగఁద్రావిపోయి యేకొలఁది నాళ్లొ
కానియేండ్లను పూండ్లను గడువలేదె?
వృత్తి కనుకూలమైన యీవేష భాష
లెట్టులలవడెనొకో— నీ కింతలోన
త్రాడు గట్టిన తప్పున కోడియైనఁ
బగలు చూచినకంట నాపైన మఱచి
మఱల చూడనివాఁడు నిన్మాత్ర మెటుల
వలచెననుకొని బొందలోఁబడితి వమ్మ! 8

# జోస్యము

చిన్ననాఁడు మాతాత నాచేయిఁజూచి
"యఱువదేఁడులు జీవింతు వబ్బి!" యనుచు
రాగిదమ్మిడియైనఁ గోరకయె తాను
జోస్యమువచించి పైవంకఁజూచి నవ్వె 1

అటులనవ్వెద వేమిటికనుచు నేను
ప్రశ్నసేయఁగ లేదు; స్వభావముగను
తాతమోమున నవ్వు దొంతరలు నిత్య
వాస మొనరించు టెఱిఁగినవాఁడ నగుట 2

బాలచాపల్య సముదిత భావములకుఁ
దోడు దుఃఖమ్ము లెఱిఁగినవాఁడఁ గామి
జోస్య సిద్ధాంతములతోడ సుంతయైన
నాకుఁ బనిలేకపోయె నానాఁడు, నిజము 3

మాకు మాటలుజరిగిన మందిరమునఁ
దలలుపండిన పెద్దపెద్దలను దాత
ముక్తి మార్గోపదేశాభి ముఖులఁజేసి
సతతము పురాణమును జెప్పి సంతసించు 4

ఎవరెవరి కెంతయంటిన దెఱుఁగఁగాని
తాతనేర్చిన వేదాంతతత్త్వ మఖిల

మందలకు నూరిపోసె నటంచు జనులు
చెప్పుకొనుచుండ్రు కథవోలె నిప్పటికిని 13

శక్తికనుకూలముగఁ బేదజనుల కిడుట
నిశ్చితార్థమ్ము నొరులకు నేర్పరతియు
తరలిపోలేదు మాయమై తాతతోనె;
ఇప్పటికిఁ గూడనదియె మాయింటివరుస 14

ఆదినము తాతగోపీ జనాంబరాప
హారణగాథ 'పురాణించు' ననుచుఁదెలిసి
తెకతలనుగట్టుకొని పోతి తీవ్రమనుచుఁ
బంతులయ్యకు బడికిని స్వస్తిచెప్పి 15

బాల్యమాదిగ నే కళ్లోపాసినగుట
బడిచదువులన్నఁ గటకట పడెడువాఁడ
నందుచే బండపాపయ్యననుచు; నాదు
తికమకఁదెలియని పంతులు తిట్టువాఁడు 16

పిన్ననయ్యును బెంకెకుఁ బెద్దనగుటఁ
దిట్టలకుఁ దిమ్మలకు లక్ష్యపెట్టి యొకరి
యడుగుజాడల వెంబడి నడిచినట్టి
పాపమునఁ బోవఁగాలే; దబద్ధమేల? 17

బుద్ధికిని దోఁచినట్టుల పోయిపోయి
యీశ్వరాభిమతమ్ముగ నెన్నఁడైన

వానికై వాఁడె మార్పుగావలయుఁగాని
కలరె? స్వచ్ఛందజీవి నాకట్టువారు 18

నాఁడు శ్రోతలెవరుఁ బురాణమ్ము వినఁగ
వచ్చియుండఁగ లేదంతవఱకు; నటకుఁ
దాతమాత్రము భాగవత ద్వితీయుఁ
డై ప్రతీక్షించుచుండె జనాళికొఱకు 19

ముసలివా రొక్కరును రాకమునుపు నేనె
త్వరితముగఁబోయి నా పెద్దతనముఁ జాటి
'వేపి' వేధించి హస్తమ్ముఁ జూపి, తాత
చేతఁ బెట్టించుకొంటిని, సిరియుఁజుక్క- 20

ప్రథమమందునఁ జేరినవాఁడనగుట
విధిగ సిరి, చుక్క, నిడి, చేయి విడువకందుఁ
బిచ్చిగీతలలో నేమివింతఁ గనెనొ?
మొదలువెట్టెను జ్యోతిషమును వచింప 21

గొల్లపడుచులు నీరాడు కొనుచునుండఁ
గృష్ణపతి చీరలెల్ల దొంగిలిన వారు
సిగ్గు నేరీతి దాఁచి రక్షించుకొనిరొ
తెలియనరిగిన నాకు జ్యోతిష్యమేల? 22

కాని నిస్పృహతోఁ దాతగారు నాదు
కరముతోఁబాటు సాముద్రికంపు గొడవ

విడువక వచించుచునెయుండ విసువుపుట్టి
సాహసము గూరియుంటి నీ చందముగను 23

“అఱువదేఁడులు బ్రదుకుదు వనెదుగాని
భావి పరిణామమునుజూచి వచ్చి రెవ్వ ?
రది యటులనుంచి నేనిట కరుగుదెంచు
కారణముఁదెల్పు ! వచియింపఁ గలుగునెడల 24

“వెడఁగు దామోదరా ! నీవు బడికిఁజనక
నా పురాణమ్ము వినవచ్చినావు గాదె ?
చెప్పుమా ! నేను కన్నెత్తి సేయ”ననుచు
సాంత్వనము లాడినను గుండె జలదరించె 25

తేలుగుట్టిన దొంగను బోలెద్గొలుత
పెదవి పైకెత్తనేరకా పిదపనెటులో
కాదనుచు బూకరించితిఁగాని, నాదు
పప్పుడక లేదు; ధానికి నొప్పికొనక 26

అంత జ్యోతిష్యమనఁగ నొకింత మనసు
కుదురఁ బ్రశ్నా పరంపరల్ గురిసితాత
మెడలు విఱువఁగ, నాపోరు పడఁగలేక
కొంగ దాఁటులతోఁ దప్పుకొనుచునుండె 27

దాని గ్రహియించి, వస్త్రమ్ములోన దూరు
చీడ పురువునుబోలె నే పీడనైతి;

మనసు గుదిరినవెనుక నే మనుజుఁడైన
దాసుఁడై పోఁడె యేపాటి దానికైన 28

అంత నొక్కొక్కరుగ శ్రోత లరుగుదెంచి
మధ్య రసభంగమొనరించి మాప్రసంగ
మాన కట్టఁగఁదాత నా మ్లానవదన
మరసి వచియించెనిట్లు నన్ననునయింప 29

"పట్టుమని కూరుచుండిన యట్టులేను
స్పష్టముగ నిపుడు వచింపఁ జాలఁగాని
వయసు ముదిరినవెనుక నీవలన నేదొ
ప్రబలకార్యమ్ము సాధింపఁబడుట నిజము 30

ఇపుడు దాని స్వరూపమ్ము నేర్పరింపఁ
బూనఁ గీర్త్యపకీర్తులలోన నొకటి
శాశ్వతమ్ముగ మనవంశ సంపదలకు
మూటఁ గట్టుదువోయి! మున్ముందు నీవు 31

మంచిరొయొ? చెడుగొ? నీవు గావించుపనికిఁ
బిలిచి పిలువకముందె నీ వెంటనంటి
యాదుకొనువారు, ననుయాయులైనవారు
పలువురుందురు; సొంత సిబ్బందివోలె 32

వంశమెఱుఁగని యొక యపూర్వంపుగళకు
సానుభూతిని జూపించి స్థానమొసఁగి
యా విలక్షణశకమున కాదిపురుషుఁ
డనఁగఁ బరగెదు; నిస్సంశయముగ నీవు 33

# ప్రణయార్చకుఁడు

శిల్పకారుండనై నేను సృష్టిఁజేసి
మలిచి తీర్చిన రత్నాల మంటపమున
నీదు రూపమ్ము నెలకొల్పి నెలఁత! నేను
కొలుచుచుంటిఁ బరీక్షింపఁ గోరవేమి? 1

సౌమ్యగాంభీర్యసంపూర్ణ సాగరుండ
నై - యహర్నిశ మొడలూర కవిసిపోవు
నట్లు నీ కీర్తనము సేయునట్టి నాదు
గీత గాన మాధుర్యమ్ము నాతి! వినవె 2

జలధర కుమారుఁడనయి సిచ్చలు కరంగి
యచల దీక్షాతి దుఃఖ వర్షాశ్రుకోటిఁ
గురియుచుంటిని విప్రయుక్తుండ నగుట
జాలిగూరఁగరాదె? శంపాలతాంగి! 3

సరస మాధుర్య నియత ప్రశాంత కాంత
ధవళ కిరణుండనై ప్రేమభవనమునకుఁ
జనెడు మార్గానఁ జంద్రికా ఛ్ఛత్రమెత్తి
వేచియున్నాఁడ ర మ్మరవిందనయన 4

ప్రకృతి పరిశోధకుఁడ నయి ప్రతిపదార్థ
తత్త్వము నెఱుంగు వ్యగ్ర చిత్తమ్ముతోడ
నరసి యారసి యన్నిటియందు నన్ను
మాత్రమే చూతు నిది యెట్టిమాయ? దేవి! 5

పరమ భక్తుండనై నే నుపాసనమ్ము
సలుపు నాకారరహిత తేజమ్మునకును
దావకీన స్వరూప మాధార మన్న
సత్య మెఱుకాయె వరము లొసంగరాదె? 6

పటుతరోన్మాదకుఁడనయి భావముద్రి
తంబయిన దానినే నిఖిలంబునందుఁ
గనుచుఁ బరవశతావేగ గరిమ నుంటి
నౌషధ మెఱుంగు నెడ చెప్పవా? లతాంగి! 7

ఈ యమూల్యావకాశమ్ము నేల విడువఁ
బూనెదవు సుమ్ము! మన్మనఃపూర్ణ కామ
దీ మహా గ్రంథ పత్రాళిఁ ద్రిప్పి ద్రిప్పి
యక్ష రాక్షర తత్త్వార్థ మరయు మబల! 8

కవి కుమారక పట్టమ్ము గట్టుకొన్న
భావసామ్రాజ్య పీఠికాభాగమందు
భువనమోహనమౌ నీదు మూర్తి కలదు
రస విచారణ సేయంగ రాదె? సుదతి 9

చిత్రకారుండనై విరచించుకొన్న
మన్మనో నందనోద్యాన మహితభూమి
భావమందారశాఖాగ్రభాగ మెక్కి-
కోకిలాంగనవై పాడుకొనుము బాల ! 10

ప్రణయగాథా సుధాపూర్ణ పత్రికామ
తల్లినై విశ్వమంగళాదర్శమునకు
మూలబంధమ్మౌ నగు నన్ను ముద్దుగొనుచుఁ
జదివి సంతోషపడఁగ నెంచవె నవోఢ ! 11

# ప్ర బో ధ ము

క్రదన క్షోణి తలంబులన్ రిపు శిరః
కాండంబులన్ బంతు ల
ట్లదరన్ గొట్టి భుజాబలమ్మున స్వరా
జ్య స్థాపనం బాచరిం
చి - దిశాంతంబులఁ గీర్తినింపి యలఘు
శ్రీమంతులై ధీ విశా
రదులై వెల్గరె? కమ్మ వీర వరు లాం
ధ్రక్షోణిలో నెల్లెడన్ 1

అరి వీరోజ్జ్వల కంఠలుంఠన సమి
ద్వ్యాపార పారంగతుల్
స్థిరకీర్తిప్రమదాకరాగ్రమిళిత
శ్రీగంధ చర్చారతుల్
నిరత ప్రాభవ విక్రమక్రమ కళా
నిర్నిద్ర భద్రాత్మకుల్
ధర నేతాదృశకమ్మవీరుల చరి
త్రం బెన్న సామాన్యమా! 2

ఒకరొక రొకట-లోకము మ
హాబాద్ధతి నుకట-డగించు వారు, న

ద్దిక్కుల దానకర్ణులని
            దివ్య యశంబును గన్నవారు, స
మ్యక్కమనీయమౌ కవిత
            నల్లగ నేరిచినట్టివారు, ము
న్నిక్కులమందుఁ బుట్టి నుతి
            కెక్కె గతించిరి కీర్తిశేషులై          3

ఢిల్లిసుల్తాను నోడించిన బల సము
            న్నిద్రుఁ డల్ల ప్రతాపరుద్రుఁ డెవఁడు?
అరివీరనిర్మథ నాసక్తుఁడగు పెమ్మ
            సాని తిమ్మక్షితీశ్వరుఁ డెవండు?
దానకర్ణుండు నాఁదత కీర్తినందిన
            వెంకటాద్రి క్షమా విభుఁడెవండు?
నిరుపమవిక్రమ, నిలయుఁడౌ రావెళ్ళ
            మల్లికార్జున భూరమణుఁ డెవండు?
        క్రమకుల నీరనిధి సుధాకరులుగారె!
        వారల పవిత్ర రక్తప్రవాహమందుఁ
        బుట్టువొందిన మీరలా పూర్వయశము
        నిలుపఁగా వలయును క్రమకులజులార!          4

వైరి బలప్రకాండముల
            వక్షములన్ విదళించి మించి, దు
ర్వారతర ప్రతాప విభ
            వమ్మున వెల్గుచు భారతావనిన్

భూరి యశంబు గన్న మన
పూర్వుల శస్త్రములెల్ల తొంటి యా
కారములన్ ద్యజించి భువిఁ
గర్షక పాళుల జేరి నేఁటికిన్
సీరములందుఁ గజ్జులయి
చీల్చుచునున్నవి భూతలంబులన్.

కమ్మ కులంబునన్ బొడము
కారణ మూఁతగఁ గొంచునంత మా
త్రమ్మున నే తరింతు మను
ధైర్యము తోడఁ జరించు నట్టి కా
లమ్ము గతించి పోయెను; కు
లమ్మున వన్నె దొఱంగ నీక, ధీ
సమ్మతమైన కార్యములు
సల్పిన యప్పుడె కీర్తి దక్కెడున్.

తాతల కీర్తి తంత్రుల ప్ర
తాపము తీరును భట్టులుం జరి
త్రాతురులైన వారలు త
మంతటఁ దా మొగ్రహించి విశ్వ వి
ఖ్యాత మొనర్పఁగాఁ గల ర
గత్యము లేదది మీకుఁ గాన ద
తీస్థిత యశోంగనా మణికిఁ
జేవ యొసంగుఁడు కమ్మసోదరుల్



ఏటుకూరి వేంకటనరసయ్య
గారి పుస్తకాలు

మగువ మాంచాల

క్షేత్రలక్ష్మి

ప్రేమాలోకము

రైతు (హరికథ)

సూక్తిసుధ

సిద్ధాశ్రమము

